









# వ్యక్తిత్వ వికాసం

## విచారణ

## ధీరయువతకు







# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ధీరయువతకు...

## To The Brave Youth

స్వామి వివేకానంద



రామకృష్ణ మఠం

దోమలగూడ, హైదరాబాదు-500 029

# Foreword

This is the third in our series of bilingual books. The first book 'Jagruti' received a phenomenal response from readers in general and youth in particular. But in 'Jagruti' mostly two line or three line quotations are selected. That book is meant to introduce the reader to some of the teachings of Swami Vivekananda in brief. This book 'To the Brave Youth..' is construed to expose the reader to Swamiji's teachings in a greater detail. Our understanding that quotations if given in original (English), and with Telugu translation will enable the reader to grasp the idea better has been vindicated by the popularity of the previous books of this type. This has encouraged us to plan more books of this kind.

The present volume is the result of such an effort. In this book quotations that fall into a particular category and pertain to an idea are given under one heading. This will facilitate the reader to grasp the idea in its fullest measure as each successive quotation in that particular category will try to reinforce the idea mentioned before. Some of the ideas and quotations might have been repeated here and there in part. We have deliberately retained them as they are not exact duplications but form part of a larger quotation. We sincerely hope this compilation will help the readers to derive greater inspiration from Swami Vivekananda's teachings.

- Publisher

# ముందుమాట

మా ద్విభాషా పుస్తకాల క్రమంలో మూడవ పుస్తకం ఇది. మొదటి పుస్తకం 'జాగృతి' కి పాఠకుల నుంచి ముఖ్యంగా యువత నుంచి అనూహ్యమైన స్పందన లభించింది. జాగృతి పుస్తకంలో కేవలం రెండు, మూడు పంక్తుల స్ఫూర్తి వాక్యాలను ఎన్నుకోవటం జరిగినది. పాఠకులకు స్వామి వివేకానంద బోధనలను సంక్షిప్తంగా పరిచయం చేయటానికి ఆ పుస్తకం ఉద్దేశించ బడినది. స్వామి వివేకానంద బోధనలను పాఠకులకు ఇంకాస్త వివరంగా పరిచయం చేయటానికి ఈ 'ధీరయువతకు...' పుస్తకాన్ని సంకల్పించాము. స్వామిజీ ధీర వాక్కులను మూల భాషలోనూ (ఆంగ్లంలో), మరియు తెలుగు అనువాదంతో సహా ఇవ్వడం వల్ల వాక్యం చక్కగా అర్థమవుతుందన్న మా భావన 'జాగృతి' పుస్తకం పొందిన ప్రజాదరణతో నిజమని నిరూపింపబడింది. ఇలాంటి పుస్తకాలను ఇంకా తీసుకు రావటానికి మాకు ప్రోత్సాహం లభించింది.

ఆ ప్రయత్నంలో భాగమే ఈ ప్రస్తుత పుస్తకం. ఈ పుస్తకంలో ఒకే విషయానికి సంబంధించిన స్ఫూర్తి వాక్కులన్నింటినీ ఒక శీర్షిక క్రింద కూర్చటం జరిగినది. వరుసలోని ప్రతి సూక్తి క్రితం పేజీ లోని సూక్తిని బలోపేతం చేస్తుండటం వలన పాఠకుడు ప్రతి సూక్తినీ చక్కగా అర్థం చేసుకోవటానికి వీలుంది. కొన్ని భావాలు, సూక్తులు అక్కడక్కడ పునరావృతమై ఉండవచ్చు. అవి ఒకేరకంగా పునరావృతం కాకుండా ఒక పెద్ద సూక్తిలో భాగంగా ఉన్నాయి కాబట్టి వాటిని ఉద్దేశపూర్వంగా అలాగే ఉంచటం జరిగినది. స్వామి వివేకానంద సూక్తుల నుంచి అధిక ప్రేరణ పొందటానికి పాఠితులకు ఈ పుస్తకం ఉపయుక్తం అవుతుందని భావిస్తాము.

- ప్రకాశకులు

# విషయ సూచిక

*My ideal, indeed can be put into a few words and that is : To preach unto mankind their divinity, and how to make it manifest in every moment of their life.*

నా ఆశయాన్ని క్లుప్తంగా కొన్ని మాటల్లో చెప్పవచ్చు. అదే- మానవకోటికి వారిలోని దివ్యత్వాన్ని గూర్చి బోధించి, వారి జీవిత ప్రతికార్యకలాపంలోనూ ఆ శక్తిని ఎలా అభివ్యక్తం చేయాలో ప్రబోధించడమే.



*Each soul is potentially divine. The goal is to manifest this divinity within by controlling nature, external and internal. Do this either by work, or worship, or psychic control, or philosophy - by one, or more, or all of these - and be free. This is the whole of religion. Doctrines or dogmas, or rituals, or books, or temples, or forms, are but secondary details.*



ప్రతి జీవిలో దివ్యత్వం గర్భితంగా ఉంది. బాహ్యాంతర ప్రకృతిని నియంత్రించి, అంతర్గతమైన దివ్యత్వాన్ని అభివ్యక్తీకరించడమే జీవిత పరమావధి. దీనికై  కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గాలలో ఒక్కటిగాని, కొన్నింటినిగాని, లేదా అన్నింటినీగానీ అవలంబించి ముక్తులవ్వండి. మతసారం ఇదే. వాదాలు, సిద్ధాంతాలు, కర్మకలాపాలు, గ్రంథాలు, దేవాలయాలు, బాహ్యరూపాలు, మూర్తులు - ఇవన్నీ అప్రధానాంశాలు.

*Everything that is strong and good and powerful in human nature is the outcome of that divinity, and though potential in many, there is no difference between man and man essentially, all being alike divine.*

మానవునిలో ఏదేది ప్రబలమో, మంచిదో, శక్తిమంతమో అదంతా ఆ దివ్యత్వ వ్యక్తీకరణే. అనేకులలో అది గర్భితంగానే ఉన్నా అందరూ దివ్యులే. కాబట్టి మనిషికీ మనిషికీ మధ్య నిజానికి భేదం లేదు.



*All power is within you... Believe in that, do not believe that you are weak... Stand up and express the divinity within you.*



శక్తి అంతా మీలోనే ఉంది!... దీనిని విశ్వసించండి. బలహీనులమని భావించకండి!... లేచి నిలబడి మీలో అంతర్లీనంగా ఉన్న శక్తిని ప్రకటించండి!

*We are the children of the Almighty, we are sparks of the infinite divine fire. How can we be nothings? We are everything, ready to do everything; we can do everything, and man must do everything.*

మనం సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని బిడ్డలం, ఆ అఖండ దివ్యాగ్నిలో నిప్పరవ్వలం. మనం పనికిరానివారం ఎలా అవుతాం? మనం సర్వం సాధించడానికి సిద్ధంగా ఉన్నాం. మనం దేనినైనా చేయగలం, మనిషి ఏ కార్యాన్నైనా సాధించి తీరాలి.



*Our power, and blessedness, and wisdom, cannot but grow into the Infinite. Infinite power and existence and blessedness are ours, and we have not to acquire them; they are our own, and we have only to manifest them.*



మన శక్తి, మన అనుగ్రహబలం, మన జ్ఞానం ఆ పరిపూర్ణంలో లీనమయ్యేంత వరకూ పురోగమించాల్సిందే. పూర్ణ సచ్చిదానంద లక్షణాలు, అనంత శక్తులూ మనలోనే ఉన్నాయి. వాటిని ఇప్పుడు ఆర్జించుకోనక్కరలేదు, అవి మనవే. చేయవలసిందల్లా వాటిని అభివ్యక్తీకరించడమే.

Manifest the divinity within you, and everything will be harmoniously arranged around it.

మీలో ఉన్న దివ్యత్వాన్ని వ్యక్తీకరించండి.
అంతా చక్కగా సర్దుకుంటుంది.



*Infinite perfection is in every man, though unmanifested. Every man has in him the potentiality of attaining to perfect saintliness, Rishihood,.... or to the greatness of a hero in material discoveries.*



అభివ్యక్తం కాకపోవచ్చు కాని, అనంతమైన పూర్ణత్వం ప్రతి మనిషిలోనూ ఉంది. ప్రతి వ్యక్తి పరిపూర్ణమైన యోగిగా, ఋషిగా లేదా భౌతికశాస్త్ర రహస్యాలను కనుగొనే ధీరుడిగా రూపొందడానికి శక్తిసామర్థ్యాలు కలవాడే.

*Man has infinite power within himself, and he can realize it.... It can be done; but he does not believe it.*

మనిషి అంతర్గతంగా అనంతశక్తి కలిగివున్నాడు. అతడు దానిని అనుభూతమొనర్చుకో గలడు, అది సాధ్యమే. అయినా ఆ విషయంపై మనిషికి నమ్మకం లేదు.





*To me the thought of oneself as low and humble is a sin and ignorance.*



నా దృష్టిలో ఎవరైనా తనను తాను అల్పుడనని, హీనుడనని తలచడమే మహా పాతకం, అజ్ఞానం.

*Infinite knowledge abides within everyone in the fullest measure. You are not really ignorant, though you may appear to be so... You may laugh at me now, but the time will come when you will understand. You must.*

ప్రతి ఒక్కరిలోనూ అనంత జ్ఞానము పూర్ణముగానే ఉంది. మీరు అజ్ఞానులుగా కనబడవచ్చు గాని, నిజానికి మీరు అజ్ఞానులు కారు. నా మాటలకు మీరిప్పుడు నవ్వవచ్చు, కాని వాటిని అర్థం చేసుకొనే సమయం వచ్చే తీరుతుంది. మీరు నన్ను తప్పక అర్థం చేసుకొనితీరతారు.



*This Atman is the same in all, there is only a difference of manifestation in different individuals. Try to manifest this Atman, and you will see your intellect penetrating into all subjects... With the manifestation of the Atman you will find that science, philosophy, and everything will be easily mastered.*



అందరిలోనూ ఉన్న ఆత్మ ఒక్కటే! కాని అభివ్యక్తీకరణలోనే తారతమ్యం ఉంది. ఆ ఆత్మ చైతన్యాన్ని జాగృత పరచుకోవడానికి ప్రయత్నించండి. అప్పుడు మీ బుద్ధి సునిశితమై అన్ని విషయాలను గ్రహించడం గమనిస్తారు. ఆత్మశక్తి జాగృతమైతే విజ్ఞాన శాస్త్రం, తత్త్వ శాస్త్రం... సమస్త జ్ఞానాన్ని సులభంగా సముపార్జించ వచ్చని మీరు గ్రహిస్తారు.

*Arise, awake, sleep no more; within each of you there is the power to remove all wants and all miseries. Believe this, and that power will be manifested.*

లేవండి! మేల్కొనండి! ఇకపై నిద్రించకండి

(అజ్ఞానాంధకారం నుండి బయటకు రండి).

ప్రతి ఒక్కరిలోనూ కోరికలు, దుఃఖాలను తొలగించుకొనే

శక్తి ఉంది. నమ్మండి! అప్పుడు ఆ శక్తి ప్రకటితమవుతుంది.



*Man stands on the glory of his own soul, the infinite, the eternal, the deathless - that soul which no instruments can pierce, which no air can dry, no fire can burn, no water can melt, the infinite, the birthless, the deathless, without beginning and without end, before whose glory space melts away into nothingness and time vanishes into non-existence. This glorious soul we must believe in. Out of that will come power.*



అనంతమైన, అఖండమైన, అవినాశియై భాసిల్లుతున్న తన ఆత్మ వైభవం పైనే మనిషి ఆధారపడి ఉన్నాడు. ఆ ఆత్మలోకి ఏ ఆయుధమూ చొరలేదు, ఆ ఆత్మను గాలి ఆర్పలేదు, అగ్ని దహించలేదు, నీరు తడుపలేదు. దానికి ఆద్యంతాలు లేవు, జన్మ మృత్యువులు లేవు. ఆత్మ ప్రభావం ఎదుట ఆకాశం శూన్యంగా తోస్తుంది. కాలం అభావమైపోతుంది. ఇట్టి మహిమోపేతమైన ఆత్మయందు మనకు విశ్వాసం ఉండాలి. అందులోంచి మనకు శక్తి వస్తుంది.

*The infinite power of the spirit, brought to bear upon matter evolves material development, made to act upon thought evolves intellectuality, and made to act upon itself makes of man a god.*

అనంతమైన ఆత్మశక్తిని భౌతిక పదార్థంపై నిలిపితే భౌతిక వికాసం కలుగుతుంది. మనస్సుపై కేంద్రీకరింప జేస్తే ధీశక్తి, జ్ఞానం పెంపొందుతాయి. తన మీదనే ఆ అనంతశక్తిని నిలిపితే అది మనిషిని దేవునిగా మారుస్తుంది.



*Believe, therefore, in yourselves, and if you want material wealth, work it out; it will come to you. If you want to be intellectual, work it out on the intellectual plane, and intellectual giants you shall be. And if you want to attain to freedom, work it out on the spiritual plane, and free you shall be and shall enter into Nirvana, the eternal Bliss.*



ఆత్మవిశ్వాసాన్ని కలిగి ఉండండి. మీకు లౌకిక సంపద కావలసినట్లయితే దానికోసం ప్రయత్నించండి. అది మీకు లభిస్తుంది. మీరు మహా మేధావంతులు కాగోరితే బుద్ధిభూమికపై దృష్టి నిలపండి. అప్పుడు మీరు మహామేధావులు కాగలరు. మీరు మోక్షాన్ని కోరితే ఆధ్యాత్మిక భూమికలో (శారీరక, మానసిక స్థాయిలను దాటి) సాధన సాగించండి. అప్పుడు మీరు ముక్తులై నిర్వాణాన్ని (అంటే శాశ్వతానందాన్ని) పొందుతారు.

*Infinite power is in the soul of man, whether he knows it or not. Its manifestation is only a question of being conscious of it....With the full consciousness of his infinite power and wisdom, the giant will rise to his feet.*

అనంత శక్తి మనిషి ఆత్మయందే ఉంది. ఆ శక్తి గురించి అతనికి తెలిసి ఉండవచ్చు లేదా తెలియకపోవచ్చు. ఆ ఆత్మ గురించిన ఎరుకను కలిగి ఉండటమే దానిని అభివ్యక్తం చేయడమంటే... మనిషి తన అనంత శక్తిని, జ్ఞానాన్ని గుర్తెరిగినప్పుడు ఆత్మ స్వీయ ఔన్నత్యాన్ని ప్రకటిస్తుంది.



*Proclaim to the whole world with trumpet voice, "There is no sin in you, there is no misery in you, you are the reservoir of omnipotent power. Arise, awake, and manifest the Divinity within!"*



భేరీనాదంతో లోకమంతటా చాటండి. "మీలో ఏ పాపమూ లేదు;,దైన్యము లేదు, మీరు అనంతశక్తి సంపన్నులు. లేవండి! మేల్కొనండి! మీలో ఉన్న దివ్యత్వాన్ని వ్యక్తీకరించండి".

*The germ of infinite perfection exists in all. We should cultivate the optimistic temperament, and endeavour to see the good that dwells in everything. If we sit down and lament over the imperfection of our bodies and minds, we profit nothing; it is the heroic endeavour to subdue adverse circumstances that carries our spirit upwards.*

అనంత పరిపూర్ణత్వం బీజరూపంలో అందరిలోను ఉంది. మనం ఆశావహ దృక్పథాన్ని అలవరచుకొని, అన్నింటిలో ఉన్న మంచినే చూడడానికి ప్రయత్నించాలి. మనం మూల కూర్చొని దేహంలోని, మనస్సులోని లోపాలను గురించి దుఃఖించడం వల్ల కలిగే ప్రయోజనమేదీ లేదు. ప్రతికూల పరిస్థితులను అధిగమించడానికి చేసే వీరోచిత ప్రయత్నమే ఆత్మోన్నతిని కలుగజేస్తుంది.



The more I live, the more I become convinced everyday that every human being is divine. In no man or woman, however vile, does that divinity die.



జీవితం గడుస్తున్న కొద్దీ రోజురోజుకూ ప్రతిమనిషీ దైవమే అనే భావన నాలో దృఢ పడుతోంది. ఎంత దుష్ట స్వభావం గల స్త్రీలోనైనా, పురుషుడిలోనైనా ఆ దైవత్వం నశించదు.

*You must know what you are, what your real nature is. You must become conscious of that infinite nature within. Then your bondage will burst.*

నీవు ఎవరివి, నీ స్వస్వరూపం ఏమిటో తెలుసుకో.
అంతర్నిహితంగా ఉన్న అనంత శక్తిని జాగృత పరచుకో.
అప్పుడు బంధాలు తెగిపోతాయి.



Think all of you that you are the infinitely powerful Atman, and see what strength comes out.

మీరంతా అనంత శక్తి సమన్వితమైన ఆత్మ స్వరూపులుగా భావించుకోండి. (అప్పుడు) ఎలాంటి శక్తి ప్రకటితమౌతుందో చూడండి.



"Knowledge is power," says the proverb, does it not? It is through Knowledge that power comes. Man has got to know that he is a man of infinite power and strength. Really he himself is by his own nature potent and omniscient. And this he must know. And the more he becomes conscious of his own Self, the more he manifests this power, and his bonds break and at last he becomes free.

'జ్ఞానమే (సర్వోత్కృష్టం) శక్తి' అని లోకోక్తి కదా! జ్ఞానంతోనే మనం శక్తిమంతులమవుతాం. మనిషి తనను తాను అనంత శక్తి సమన్వితుడిగా బల సంపన్నుడిగా తెలుసుకోవాలి. మనిషి స్వస్వరూప రీత్యా సర్వజ్ఞుడు, సర్వ శక్తిశాలి. ఇది అతడు తప్పక గ్రహించాలి. తన ఆత్మ స్వరూపాన్ని గ్రహిస్తున్న కొద్దీ మనిషి ఈ శక్తిని అధికంగా ప్రకటితం చేయగల్గుతాడు. బంధాల నుండి విడివడి ముక్తుడవుతాడు.



The soul was never born and will never die, and all these ideas that we are going to die and are afraid to die are mere superstitions. And all such ideas as we can do this or cannot do that are superstitions. We can do everything.



ఆత్మ ఎన్నడూ జన్మించి ఉండలేదు, ఎన్నడూ మరణించదు. మనం మరణిస్తామన్న భావన, చావుకు భయపడటం వంటివి కేవలం మూఢనమ్మకాలు. మనం దీనిని చేయగలం, దానిని చేయలేం అనే భావాలు కూడా భ్రాంతి జనితాలే. మనం అన్నింటినీ చేయగలం.

*The Vedanta teaches men to have faith in themselves first... Not believing the glory of our own soul is what Vedanta calls atheism. To many this is, no doubt, a terrible idea; and most of us think that this ideal can never be reached; but the Vedanta insists that it can be realized by everyone.*

వేదాంతం మనిషికి ఆత్మవిశ్వాసాన్ని కలిగి ఉండడం ప్రప్రథమ విషయంగా బోధిస్తోంది. మన ఆత్మ ఔన్నత్యాన్ని మనం విశ్వసించకపోవడమే నాస్తికత అని వేదాంతం సంబోధిస్తోంది. అనేకులకు ఈ భావం మహాదారుణంగా తోస్తుందనడంలో సందేహం లేదు. ఈ ఆదర్శం మనం చేరుకోగలిగేది కాదని చాలా మంది భావిస్తారు. కాని 'ప్రతిమనిషీ దీనిని పొందగలడు' అని వేదాంతం నొక్కి వక్కాణిస్తోంది.



*Always talk and hear and reason about this Atman. By continuing to practise in this way, you will find in time that the Lion (Brahman) will wake up in you too.*



ఎల్లప్పుడు ఆత్మను గూర్చి వినండి. ఆత్మను గూర్చి మాట్లాడండి. ఆత్మను గూర్చి విచారణ చేస్తుండండి. ఈ విధంగా సాధన సాగిస్తే, కాలక్రమంగా మీలోని సింహము (బ్రహ్మము) కూడా మేల్కొంటుంది.

The self Within is always shining forth resplendent. Turning away from that people say, "I", "I", "I", with their attention held up by this material body, this queer cage of flesh and bones. This is the root cause of all weakness.

అంతరాత్మ ఎల్లప్పుడు దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది. దాని నుండి తొలగిపోయి ఈ ఐహికమైన మాంసం, ఎముకలతో కూడిన పంజరం వైపు తమ దృష్టిని మరల్చి, మానవులు 'నేను', 'నేను', 'నేను' అని అంటున్నారు. బలహీనత లన్నింటికి ఇదే మూలం.



*If matter is powerful, thought is omnipotent. Bring this thought to bear upon your life, fill yourselves with the thought of your almightiness, your majesty and glory.*



జడపదార్థం శక్తి సమన్వితమైతే, సంకల్పం సర్వశక్తి సమన్వితం. ఈ విశ్వాసం మీ జీవితాల్లో కనిపించు గాక! మీ ఘనత, మీ ఔన్నత్యం, సర్వశక్తిమంతమైన మీ స్వభావాన్ని గూర్చిన ఆలోచనలను నిరంతరం కలిగి ఉండండి.

*These conceptions of Vedanta must come out, must remain not only in the forest, not only in the cave, but they must come out to work at the bar and the bench, in the pulpit, and in the cottage of the poor man, with the fishermen that are catching fish, and with the students that are studying... If the fisherman thinks that he is the Spirit, he will be a better fisherman; if the student thinks that he is the Spirit, he will be a better student. If the lawyer thinks that he is the Spirit, he will be a better lawyer, so on..*

ఈ వేదాంత భావాలు అరణ్యాలకు, గుహలకే పరిమితం కాకుండా అందరి ముంగిట్లోకీ అవి రావాలి. న్యాయవాద వృత్తిలోని వారికి న్యాయమూర్తులకు, ఆధ్యాత్మిక సభా సమూహాలలోనికి, గుడిసెలో నివసించే పేదవాడికి, చేపలు పట్టే బెస్తవారికి, విద్యార్థి లోకానికి ఈ భావాలు అంది ఆచరణాత్మకం అవ్వాలి. చేపలు పట్టేవాడు తాను ఆత్మనని భావిస్తే ఉత్తమ బెస్తవాడుగా మారతాడు. విద్యార్థి తనను తాను ఆత్మగా భావిస్తే ఉత్తమ విద్యార్థిగా ఎదుగుతాడు. న్యాయవాది తనను ఆత్మగా భావిస్తే ఉత్తమ న్యాయవాదిగా రాణిస్తాడు.



*You have in you all and a thousand times more than is in all the books. Never lose faith in yourself, you can do anything in this universe. Never weaken, all power is yours.*

సమస్త గ్రంథాలలో ఉన్న జ్ఞానమంతా నీలోనే ఉంది. అంతకంటే వేయిరెట్లు ఎక్కువగా ఉంది. ఆత్మవిశ్వాసాన్ని ఎన్నడూ కోల్పోవద్దు. ఈ విశ్వంలో నీవు దేన్నైనా సాధించగలవు. ఎన్నడూ దౌర్బల్యానికి లోనుగాకు. సమస్త శక్తీ నీదే.



We want Shraddha, we want faith in our ownselves. Strength is life, weakness is death. 'We are the Atman, deathless and free; pure, pure by nature. Can we ever commit any sin? Impossible!'—such a faith is needed. Such a faith makes men of us, makes gods of us. It is by losing this idea of Shraddha that the country has gone to ruin.



మనకు శ్రద్ధకావాలి, ఆత్మ విశ్వాసం కావాలి. బలమే జీవనం, బలహీనతే మృత్యువు. "మేము ఆత్మ స్వరూపులం, మృత్యురహితులం, ముక్తులం, పవిత్రులం, స్వభావ సిద్ధంగా పరిశుద్ధులం. అటువంటి మేము ఎప్పుడైనా ఏ పాపమైనా చేస్తామా?... అసంభవం!" ఇటువంటి విశ్వాసం కావాలి. అటువంటి విశ్వాసం మనల్ని మనుష్యులను చేస్తుంది. దేవతలను చేస్తుంది. ఈ శ్రద్ధాభావం లోపించటం వల్లనే దేశం నాశనమై పోయింది.

Three things are necessary to make every man great, every nation great:

1. Conviction of the powers of goodness.
2. Absence of jealousy and suspicion.
3. Helping all who are trying to be and do good.

ఏ వ్యక్తి అయినా, ఏ దేశమైనా ఉన్నత స్థితికి చేరుకోవాలంటే మూడూ లక్షణాలు అవసరం. అవి -

1. మంచితనానికి ఉన్న శక్తి మీద అఖండ విశ్వాసం.
2. అసూయ, అనుమానం లేకుండా ఉండడం.
3. మంచిగా ఉండాలనుకునే వారికీ, మంచి చేయదలచుకునే వారికి తోడ్పడటం.



You are the makers of your own fortunes. You make yourselves suffer, you make good and evil and you who put your hands before your eyes and say it is dark. Take your hands away and see the light.



మీ భాగ్యానికి మీరేగదా కర్తలు. మీ వ్యధలకు మీరే కారకులు. మంచి చెడులను సృష్టించుకునేది మీరే. చేతులతో కళ్లు మూసుకొని చీకటి అంటున్నదీ మీరే. చేతులను తీసివేసి వెలుతురును చూడండి.

*Even the least work done for others awakens the power within, gradually instills into the heart the strength of a lion.*

ఇతరులకు ఏ కొద్ది పాటి మంచి చేసినా అది మనలో ఉన్న శక్తిని మేల్కొల్పుతుంది. క్రమంగా అది మన హృదయంలో సింహ సదృశమైన బలాన్ని నింపుతుంది.



It is a weakness to think someone is dependent on you, and that you can do good to him. This belief is the mother of all our attachment, and through this attachment comes all our pain. Therefore developing the attitude of non-attachment is the great lesson to learn in life, and when we have learned it fully, we shall never be unhappy... By non-attachment you overcome and deny the power of anything to act upon you!



నీపై ఎవరో ఆధారపడి ఉన్నారనీ, నీవతనికి మంచి చేయగలవని తలచడం వట్టి మనో దౌర్బల్యం. (ఈ వాక్యం యొక్క అర్థం ఇతరులకు మంచి చేయవద్దని కాదు. 'నేను ఇతరులకు మంచి చేస్తున్నాను' అని అనుకోవడం తప్పు అని తెలుసుకోవాలి.) ఈ తలంపే మన సమస్త బంధనాలకు పుట్టినిల్లు. అంతేగాక సమస్త బాధలకు ఈ మమకార భావనే మూలకారణం. అందువల్ల నిస్సంగత్వాన్ని అలవర్చుకోవాలి. అంటే బంధనాన్ని విడనాడటం ఈ జీవితంలో నేర్చవలసిన గొప్ప పాఠం. దీన్ని పూర్తిగా నేర్చుకుంటే మనకెన్నడూ అశాంతి కలుగదు. ఈ నిస్సంగత్వంతో ఏ శక్తీ నీమీద ప్రభావం చూపకుండా నీవు అధిగమించ గలవు, త్రోసిపుచ్చనూ గలవు.

Be obedient and eternally faithful to the cause of truth, humanity, and your country, and you will move the world.

సత్యానికీ, మానవాళికీ, నీ దేశానికీ

విశ్వాసపాత్రుడవై ఉండు.

నీవు ప్రపంచాన్ని కదలించి వేయగలవు.



*Be not afraid of anything. You will do marvellous work. The moment you fear, you are nobody. It is fear that is the great cause of misery in the world. It is fear that is the cause of all our woes and it is fearlessness that brings heaven even in a moment.*



దేనికీ  భయపడకండి. మీరు అద్భుతాలను సాధించగలరు. భయపడిన మరుక్షణమే మీరు ఎందుకూ పనికిరాని వారవుతారు. లోకంలోని దుఃఖమంతటికీ మూలకారణం ఈ భయమే! భయమే సర్వబంధకారిణి. నిర్భయత్వం ఒక్క క్షణంలో సైతం స్వర్గాన్ని ప్రాప్తింపజేయగలదు.

*The more opposition there is, the better. Does a river acquire velocity unless there is resistance? The newer and better a thing is, the more opposition it will meet with at the outset. It is the opposition which foretells success.*

ప్రతిఘటన, వ్యతిరేకత ఎంత ఉంటే అంత మంచిది. ప్రతిఘటన లేనిదే నదికి వడి (వేగము) వస్తుందా? ఒక విషయం ఎంత క్రొత్తదైతే, ఎంత మంచిదైతే ప్రారంభ దశలో అది అంత వ్యతిరేకతను ఎదుర్కోవలసి వస్తుంది. వ్యతిరేకతంతా విజయ సూచకమే.



*A handful of men can throw the world off its hinges, provided they are united in thought, word, and deed - never forget this conviction.*



కొద్ది మంది వ్యక్తులు మనోవాక్కర్మలయందు ఒక్కటైతే ప్రపంచాన్ని ఉర్రూతలూగించగలరు. ఈ సత్యాన్ని ఎన్నడూ మరువకండి.

*It is the coward and the fool who says, "This is fate." - so says the Sanskrit proverb. But it is the strongman who stands up and says "I will make my fate." It is people who are getting old who talk of fate.*

"ఇది తలవ్రాత" అని మూర్ఖుడు, పిరికివాడు మాత్రమే వచిస్తారని ఒక సంస్కృత సూక్తి. బలవంతుడు "నా తలవ్రాతకు నేనే కారకుణ్ణి" అని ధైర్యంగా నిలిచి చెప్తాడు. వృద్ధాప్యంలో అడుగుపెడుతున్న వారే అదృష్టాన్ని గూర్చి మాట్లాడతారు.



*If what we are now has been the result of our own past actions, it certainly follows that whatever we wish to be in future can be produced by our present actions; So we have to know how to act... By knowing how to work, one can obtain the greatest results... Even the lowest forms of work are not to be despised.*



మన వర్తమాన స్థితి పూర్వకర్మల ఫలితమైతే మనకు భవిష్యత్తులో కలిగే స్థితి ప్రస్తుత కర్మల ఫలితంగా పొందవచ్చని నిశ్చితమగుతున్నది. కాబట్టి పనులను ఎలా ఆచరించాలో మనం తెలుసుకోవాలి. ఇలా కర్మలను చేసే విధానం తెలుసుకొంటే అద్భుత ఫలితాలను పొందవచ్చు. అల్పకార్యాలుగా పరిగణించబడే వాటిని కూడా తృణీకార భావంతో చేయకూడదు.

*Feel that you are great and you will become great. We all have the same glorious soul, let us believe in it.*

మిమ్మల్ని మీరు మహాపురుషులని భావించండి ! అప్పుడు మీరు మహాపురుషులే అవుతారు. మన అందరిలో ఆ దివ్యాత్మ ఉంది. దీనిని మనం విశ్వసిస్తాం గాక!



*Never say, 'No', never say 'I cannot', for you are infinite, even time and space are nothing compared with your nature. You can do anything and everything, you are almighty.*



"కాదు, నాకు చేతకాదు" అని ఎన్నడూ అనవద్దు.

మీరు అనంతులు. మీ స్వభావంతో (నిజ స్వరూపం) పోల్చితే దేశకాలాలు అన్నీ అల్పమై తోస్తాయి. మీరు సర్వశక్తి సంపన్నులు, దేనిని చేపట్టితే దానిని సాధించగలరు.

*Whatever you think, that you will be. If you think yourselves weak, weak you will be; if you think yourselves strong, strong you will be.*

నీవేది కాగోరితే అది కాగలవు.
నీవు దీనుడవని తలిస్తే దీనుడవే అవుతావు.
బలాఢ్యుడనని తలిస్తే బలాఢ్యుడవే కాగలవు.



*Have faith in yourselves, great convictions are the mothers of great deeds.*

ఆత్మవిశ్వాసం కలిగి ఉండండి. గొప్ప విశ్వాసాల నుండే మహత్తర కార్యాలు సాధించబడతాయి.



The history of the world is the history of a few men who had faith in themselves. That faith calls out the divinity within. You can do anything. You fail only when you do not strive sufficiently to manifest infinite power. As soon as a man loses faith, death comes.



ఆత్మవిశ్వాసం ఉన్న కొందరి వ్యక్తుల చరిత్రే ప్రపంచ చరిత్ర. ఆ విశ్వాసం వ్యక్తిలోని దివ్యత్వాన్ని వ్యక్తపరుస్తుంది. మీరు ఏదైనా సాధించగలరు. ఆ అనంతశక్తిని అభివ్యక్తం చేయడానికి వలసినంత ప్రయత్నం చేయనప్పడే మీరు విఫలమవుతారు. ఎప్పుడైతే మనిషిలో నమ్మకం సన్నగిల్లుతుందో అప్పడు మరణం ఆసన్నమౌతుంది.

*What we want is this Shraddha.... What makes the difference between man and man is the difference in this Shraddha and nothing else. What makes one man great and another weak and low is this Shraddha... This Shraddha must enter into you.*

మనకు కావలసింది శ్రద్ధ... మనిషికి మనిషికి మధ్య తేడా శ్రద్ధలోఉన్న తారతమ్యమే గాని వేరేమీ కాదు. ఒక మనిషిని గొప్పవాడుగాను; ఇంకొకరిని బలహీనుడిగాను, అధముడుగాను చేసేది శ్రద్ధే... (అంటే శ్రద్ధలో వ్యత్యాసమే) కాబట్టి ఈ శ్రద్ధ మీలో ప్రవేశించాలి.



*Have faith that you are all, my brave lads, born to do great things! Let not the barks of puppies frighten you - no, not even the thunderbolts of heaven !*



ఓ నా ధీరవత్సలారా! మీరందరు మహత్కార్యాలు సాధించడానికే జన్మించామని విశ్వసించండి. కుక్కపిల్లల అరుపులు (ఇతరులు చేసే నిందలు) మిమ్మల్ని భయపెట్టకుండు గాక! అంతే కాదు, ఆకాశం నుండి పిడుగులు పడినా మీరు చలించరు గాక!

*Have faith in yourself. You people were once the Vedic Rishis. Only you have come in different forms, that's all. I see it clear as daylight that you all have infinite power in you. Rouse that up; arise, arise...*

ఆత్మవిశ్వాసం కలిగి ఉండండి. మీరందరూ ఒకప్పటి వేద ఋషులు. ఇప్పుడు మీరు వేరే రూపాలలో వచ్చారు, అంతే తేడా! మీ అందరిలో అనంత శక్తి ఉంది, పగటివేళ కాంతిలాగా ఈ విషయాన్ని స్పష్టంగా చూస్తున్నాను. ఈ శక్తిని జాగృతం చేయండి. మేల్కొండి, మేల్కొండి...



*This faith in themselves was in the hearts of our ancestors, this faith in themselves was the motive power that pushed them forward and forward in the march of civilization; and if there has been degeneration, if there has been defect, mark my words, you will find that degradation to have started on the day our people lost this faith in themselves.*



ఆత్మవిశ్వాసం మనపూర్వుల హృదయాలలో ప్రకాశించింది. నాగరికతాభివృద్ధిలో వారిని ముందుకు తీసుకువచ్చిన క్రియాశక్తి ఈ ఆత్మ విశ్వాసమే! మనకు ఏదైనా భ్రష్టత్వం, దోషం సంభవిస్తే నా మాటను గుర్తు పెట్టుకోండి - ఆ భ్రష్టత్వం మన ప్రజలు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయిన నాటి నుండి ప్రారంభమైంది.

*Have faith in yourself - all power is in you - be conscious and bring it out. Say, "I can do everything". Even the poison of a snake is powerless if you can firmly deny it. Beware! No saying "nay", no negative thoughts!*

నీలో అనంతశక్తి ఉందని విశ్వాసం కలిగి ఉండు. జాగరూకుడవై ఆ శక్తిని వ్యక్తపరుచు. "నేను ఏదైనా సాధించగలను" అని సంకల్పించు. పాము విషం కూడా గట్టిగా తిరస్కరిస్తే మీపట్ల నిర్వీర్యమైపోతుంది. జాగ్రత్త ! "చేయలేను" అని అనవద్దు. ప్రతికూల భావనలు రాకూడదు.



*Losing faith in one's self means losing faith in God.*

మీపై మీరు విశ్వాసం కోల్పోవడం అంటే భగవంతునిపై విశ్వాసం కోల్పోవడమే.



To advance we must have faith in ourselves first and then in God. He who has no faith in himself can never have faith in God.

అభివృద్ధిచెందడానికి మొదట మనపై, తరువాత భగవంతునిపై విశ్వాసం కలిగి ఉండాలి. తనపై విశ్వాసం లేనివానికి భగవంతునిపై విశ్వాసం కలగడం కల్ల.



Faith, faith, faith in ourselves,
faith, faith in God - this is
the secret of greatness.



విశ్వాసం! విశ్వాసం! ఆత్మవిశ్వాసం!
భగవంతునిపై విశ్వాసం! ఇదే ఔన్నత్య రహస్యం!

*Each one of you has a glorious future if you dare believe me. Have a tremendous faith in yourselves, like the faith I had when I was young... Have that faith, each one of you, in yourself - that eternal power is lodged in every soul - and you will revive the whole of India.*

నా మాటలను నమ్మడానికి సాహసిస్తే మీలో ప్రతి ఒక్కరికీ భవిష్యత్తులో ఉజ్జ్వలదశ ప్రాప్తిస్తుంది. నాపై నాకు చిన్నప్పుడు ఎట్టి విశ్వాసం ఉండేదో అటువంటి అఖండ విశ్వాసం మీపై మీకు ఉండి తీరాలి. అనంతశక్తి భాండాగారం ప్రతి ఆత్మలోనూ ఉంది - మీరు భారతదేశాన్ని పునర్నిర్మించగలరు.



*Let a man go down as low as possible; there must come a time when out of sheer desperation he will take an upward curve and will learn to have faith in himself. But it is better for us that we should know it from the very first. Why should we have all these bitter experiences in order to gain faith in ourselves?*



ఒక వ్యక్తి అధమాధమ స్థితిలో పడిపోయాడనుకోండి. కొంతకాలానికి అతడే, నిరాశతో తన ఈ ప్రస్తుతస్థితి నుండి ఊర్ధ్వగమనం సాగించి, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకొని తీరుతాడు. కాని మొదటి నుండే మనం దాన్ని గుర్తించడం శ్రేయస్కరం. ఆత్మవిశ్వాసాన్ని పొందడానికి మనకు ఇన్ని చేదు అనుభవాలు అవసరమా?

*If you have faith in all the three hundred and thirty millions of your mythological gods,... and still have no faith in yourselves, there is no salvation for you. Have faith in yourselves, and stand upon that faith and be strong; that is what we need.*

పురాణాలు పేర్కొన్న ముక్కోటి దేవతలపై మీకు విశ్వాసం ఉన్నప్పటికీ, మీపై మీకు విశ్వాసం లేకపోతే మీకు ముక్తి కలుగదు. ఆత్మవిశ్వాసంతో ధీరుడివై నిలబడు, అదే మనకిప్పుడు కావలసింది.



*Faith in ourselves will do everything.*
*I have experienced it in my own life.*



ఆత్మవిశ్వాసం ద్వారా సర్వం సాధించగలం.
ఈ విషయం స్వీయ జీవితంలో నాకు
అనుభవానికి వచ్చింది.

*The ideal of faith in ourselves is of the greatest help to us. If faith in ourselves had been more extensively taught and practised, I am sure a very large portion of the evils and miseries that we have would have vanished. Throughout the history of mankind, if any motive power has been more potent than another in the lives of all great men and women, it is that of faith in themselves. Born with the consciousness that they were to be great, they became great.*

ఆత్మవిశ్వాసం మనకు గొప్ప సహాయకారి. ఆత్మవిశ్వాసాన్ని గురించి విస్తృతంగా తెలియబడి, అది పెంపొందింపబడితే... మనకున్న దుఃఖాలు, రుగ్మతలు చాలా వరకూ సమసిపోయేవి. మానవాళి చరిత్రలో గొప్పగొప్ప స్త్రీ పురుషుల జీవితాలలో ఆత్మవిశ్వాసమే వారికి అత్యధిక స్ఫూర్తి దాయకమైన శక్తిగా పరిణమించింది. తాము గొప్పవారుగా అవడానికి జన్మించామని భావించి వారు గొప్పవారయ్యారు.



*Whatever of material power you see manifested by the Western races is the outcome of this Shraddha, because they believe in their muscles and if you believe in your spirit, how much more will it work! Believe in that infinite soul, the infinite power, which with consensus of opinion, your books and sages preach. That Atman which nothing can destroy, in It is infinite power only waiting to be called out... Be strong and have this Shraddha, and everything else is bound to follow.*



పాశ్చాత్యదేశాలలో మీరు చూసే భౌతిక అభివృద్ధి అంతా వారికున్న శ్రద్ధ వలన కలిగినదే. వాళ్ల కండరాలను వాళ్లు విశ్వసిస్తారు. ఆత్మబలాన్ని విశ్వసిస్తే ఇంకెంత అధికతర ప్రయోజనం కలుగుతుందో కదా! మీ శాస్త్రాలు, ఋషులు ముక్తకంఠంతో బోధిస్తున్న అనంతశక్తి సమన్వితమైన ఆ అనంతాత్మను విశ్వసించండి. నాశరహితమైన ఆ ఆత్మల నుంచి అనంతశక్తి బయల్పడడానికి సంసిద్ధంగా ఉంది. ధైర్యంగా ఉండండి. శ్రద్ధ కలిగి ఉండండి. మిగిలినది దానంతట అదే వచ్చి తీరుతుంది.

Have faith, as Nachiketa... ay, I wish that faith would come to each of you; and every one of you would stand up a giant, a world-mover with a gigantic intellect - an infinite God in every respect. That is what I want you to become.

నచికేతుని శ్రద్ధ వంటి శ్రద్ధ మీ అందరికీ కలగాలని ఆశిస్తున్నాను. మీరందరూ అసాధారణ ప్రతిభావంతులు - మీ అసాధారణ మేధతో మీరు ప్రపంచాన్నే కదిలిస్తారు - అనంత పరబ్రహ్మలుగా భాసిస్తారు. మీరందరూ ఇలా కావాలి అని నేను కోరుకుంటాను.



*Make men first. Men we want, and how can men be made unless Shraddha is there?*



మనుష్యులను తయారు చేయాలి. వ్యక్తులు కావాలి.

- శ్రద్ధ లేకుండా వ్యక్తులు ఎలా తయారవుతారు?

*What I mean to say is that want of Shraddha has brought in all the evils among us, and is bringing in more and more. My method of treatment is to take out by the roots the very causes of the disease and not to keep them merely suppressed.*

నేను చెప్పదలచుకున్నదేమంటే మనలో ఉన్న అవగుణాలన్నీ శ్రద్ధలేమి వల్ల కలిగినవే! ఈ శ్రద్ధలేమి మనకు ఇంకా అధికంగా చెడునే కొనితెస్తూ ఉంది. రోగాన్ని కేవలం నొక్కిపెట్టకుండా మూలకారణంతో సహా తొలగించి వేయడమే నా చికిత్సా విధానం.



*The idea of true Shraddha must be brought back once more to us, the faith in our own selves must be re-awakened, and, then only, all the problems which face our country will gradually be solved by ourselves.*



'శ్రద్ధ' అనే ఆదర్శాన్ని మరలా మనలో తీసుకురావాలి. ఆత్మ విశ్వాసం పునః జాగృతం కావాలి. అప్పుడు మాత్రమే మనదేశం ఎదుర్కొంటున్న సమస్యలన్నింటినీ క్రమంగా మనమే పరిష్కరించుకోగలం.

*Infinite faith and strength are the only conditions of success.*

అపార విశ్వాసం, అనంత శక్తి

- ఇవే విజయసాధనకు మార్గాలు.



*Every boy should be trained to practise absolute Brahmacharya, and then, and then only, faith - Shraddha - will come.*



ప్రతి బాలుడూ కఠోర బ్రహ్మచర్యాన్ని పాటించేటట్లు శిక్షణనివ్వాలి. అప్పడు మాత్రమే విశ్వాసం ఏర్పడుతుంది, శ్రద్ధ కలుగుతుంది.

*Be possessed of Shraddha (faith), of Virya (courage), attain to the knowledge of the Atman, and sacrifice your life for the good of others - this is my wish and blessing.*

శ్రద్ధ, ధీరత్వం కలిగి ఉండి ఆత్మ జ్ఞానాన్ని పొందండి.
పొంది మీ జీవితాన్ని ఇతరుల మేలుకై త్యాగం చేయండి
- ఇదే నా ఆకాంక్ష, ఆశీర్వాదమునూ.



Sincerity of conviction and purity of motive will surely gain the day; and even a small minority, armed with these, is surely destined to prevail against all odds.



దృఢ సంకల్పం, పవిత్ర ఆశయం తప్పక సత్ఫలితాలను ఇస్తాయి. వీటిని ఆయుధాలుగా గ్రహించిన వారు, వారు కొద్దిమందే అయినా, అన్ని విఘ్నాలను ఎదుర్కొని నిలువగలుగుతారు.

*Truth, purity, and unselfishness - wherever these are present, there is no power below or above the sun to crush the possessor thereof. Equipped with these, one individual is able to face the whole universe in opposition.*

సత్యం, పవిత్రత, నిస్వార్థత - ఈ సద్గుణాలు ఉన్నవానిని నాశనం చేయగల శక్తి సూర్యుడికి క్రిందా పైనా (సృష్టిలో) ఎక్కడా లేదు. ఈ సద్గుణ విశిష్టుడైన వ్యక్తి సమస్తవిశ్వమూ తనను ప్రతిఘటించినా ఒక్కడే ఎదుర్కోగలడు.



Let people say whatever they like, stick to your own convictions, and rest assured, the world will be at your feet. They say, "Have faith in this fellow or that fellow," but I say, "Have faith in yourself first," that's the way.



జనులను వారికి తోచింది మాట్లాడ నివ్వండి, మీ ఆశయాలను అంటిపెట్టుకొని ఉంటే, సమస్త లోకం మీ పాదా క్రాంతమౌతుంది. 'వారిపై వీరిపై విశ్వాసం ఉంచమని' వారు చెపుతారు. కాని నేను చెబుతున్నాను ప్రథమంగా మీపై విశ్వాసం కలిగి (ఆత్మ విశ్వాసము) ఉండండి. అదే మార్గం (విజయానికి).

What we want are Western Science coupled with Vedanta, Brahmacharya as the guiding motto, and also Shraddha and faith in one's own self.

మనకు ఇప్పుడు కావల్సింది వేదాంతంతో మేళవింపబడిన పాశ్చాత్య విజ్ఞానశాస్త్రం, దానికి మూలమంత్రంగా బ్రహ్మచర్యం పాటించటం మరియు శ్రద్ధ, ఆత్మవిశ్వాసాలను కలిగి ఉండటం.



*Can anything be done unless everybody exerts himself to his utmost? "It is the man of action, the lion-heart, that the goddess of wealth resorts to." No need of looking behind. FORWARD! We want infinite energy, infinite zeal, infinite courage, and infinite patience, then only will great things be achieved.*

ప్రతివారూ తమ శక్తికొలది పాటుపడనిచో, ఏ కార్యమైనా సాధ్యమవుతుందా? కార్యశూరుణ్ణి, పురుష సింహుణ్ణి విజయలక్ష్మి వరిస్తుంది. వెనుకకు చూడనవసరం లేదు. ముందుకు నడవండి! అఖండ శక్తి, అఖండ ఉత్సాహం, అఖండ ధైర్యం, సహనం... ఇవే మనకు ఆవశ్యకాలు. ఇవి ఉన్నప్పడే మహత్కార్యాలు సాధింపబడతాయి.



*Stand up and fight! Not one step back, that is the idea. Fight it out, whatever comes. Let the stars move from the spheres! Let the whole World stand against us! Death means only a change of garment. What of it ? Thus fight !*



లేవండి! పోరాడండి! ఒక్క అడుగు కూడా వెనక్కు వేయరాదు. ఏమైన రానీ, పోరాడి తేల్చుకోండి. నక్షత్రాలు గతులు తప్పినా సరే! లోకమంతా ఏకమై మిమ్మల్ని ప్రతిఘటించినా సరే! మరణమంటే దుస్తులను మార్చుకోవటం వంటిదే. దాని కేలా? (చింత ఏల?) కాబట్టి పోరాడండి!

*Most of our difficulties in our daily life come from being unable to hold our minds... Every reaction in the form of hatred or evil is so much loss to the mind; and every evil thought or deed of hatred, or any thought of reaction, if it is controlled, will be laid in our favour... Each time we control hatred, or a feeling of anger, it is so much good energy stored up in our favour; that piece of energy will be converted into the higher powers.*

మనకు నిత్యజీవితంలో కలిగే సమస్యలన్నీ మనస్సును నిగ్రహించుకోలేక పోవడం వల్ల కలుగుతున్నవే! ద్వేషపూరిత తలంపులు, చెడు భావాలు మనస్సును బలహీనపరుస్తాయి; అలాగే మనం నిగ్రహించుకున్న ప్రతి చెడు భావన, ద్వేషపూరిత చర్య మనలో సానుకూల శక్తిని ఉత్పన్నం చేస్తుంది. ద్వేషాన్ని, క్రోధ భావాన్ని నిగ్రహించుకున్నప్పుడల్లా మనలో సానుకూల భావాలు సుశక్తి రూపంలో నిక్షిప్తమై, ఇంకా ఉన్నతమైన భావప్రేరణలుగా అభివ్యక్తమౌతాయి.



*You gain nothing by becoming cowards. Taking a step backward, you do not avoid any misfortune.*



పిరికివారిగా మారి మీరు సాధించేదేమీ ఉండదు. ఒక్క అడుగు వెనుకకు వేయడం వల్ల మీరు ఏ విపత్తునూ తప్పించుకోలేరు.

*This is the one question I put to every man... Are you strong? Do you feel strength? Strength is the medicine for the world's disease.*

ప్రతి మనిషినీ నేనొక ప్రశ్న అడుగుతాను.
"నీవు బలంగా ఉన్నావా? బలం నీ బుద్ధికి
అనుభవ మవుతున్నదా?"
ప్రపంచములోని సర్వరుగ్మతలకు బలమే ఓషధం.



*Do not say we are weak; we can do anything and everything. What can we not do? Everything can be done by us; we all have the same glorious soul, let us believe in it.*



'మేము దుర్బలురము' అని ఎన్నడూ పలుకకండి.

మనం సర్వమూ చేయగలుగుతాం! మనం ఏమి చేయలేం ?

మనం సమస్తము చేయగలం. మన అందరిలో ఆ దివ్యాత్మ కలదు.

అద్దానిలో మనం నమ్మకం కలిగి ఉందాం!

Ay, let every man and woman and child, without respect of caste or birth, hear and learn that behind everyone there is that Infinite Soul, assuring the infinite possibility and the infinite capacity of all to become great and good.

ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూ, ప్రతి బాలిక, ప్రతి బాలుడూ జాతి భేదము లేక జన్మ భేదము లేక దీనిని ఆలకించి యోచన చేస్తారు గాక! "ప్రతి వారిలో ఆ అనంత ఆత్మే ప్రకాశిస్తున్నది" గొప్పవారుగా, మంచి వారుగా అగుటకు (యోగులుగా, మహర్షులుగా అగుటకు) తగిన అనంత అవకాశమూ, అఖండ శక్తీ అందరిలోనూ ఉంది.



When the soul has wrestled with circumstance and ....has struggled forward again and again and yet again - then the soul comes out as a giant.

ప



*Say "Everything is in me, and I can manifest it at will."*

సర్వము నాయందున్నది. ఇచ్ఛామాత్రమున నేను దానిని అభివ్యక్తము చేయగలను" అని పలకండి.



*What queer humility is this to say, "I know nothing!", "I am nothing!" This is pseudo-renunciation and mock-modesty, I tell you. Off with such a self-debasing spirit!*



నాకేమీ తెలియదు' , 'నేనేమీ కాను' అని చెప్పడం వినయమా?

ఇది పనికిమాలిన త్యాగం, హాస్యాస్పదమైన వినయం అని చెబుతున్నాను.

అటువంటి ఆత్మవంచనను విడనాడు.

Cherish positive thoughts. By dwelling too much upon negativism, the whole country is going to ruin!..... What a botheration! In every soul is infinite strength and should you turn yourselves into cats and dogs by harbouring negative thoughts? Who dares to preach negativism? That sort of self-deprecating attitude is another name of disease - do you call that humility? It is vanity in disguise!.... Hurl yourselves on the world like an avalanche... let the world crack in twain under your weight!

ఆశావహ భావాలను (సానుకూల, నిర్మాణాత్మకమైన భావాలను) గ్రహించండి. నిరాశా పూరిత భావాలనే ఎక్కువగా ధ్యానించడం వల్ల దేశమంతా వినాశనానికి దగ్గరవుతున్నది. ఏం చిక్కు వచ్చి పడింది! ప్రతి జీవిలోను అనంతమైన శక్తి ఉంది. వ్యతిరేక భావాలను తలపోస్తూ మీరు కుక్కలుగా, పిల్లులుగా మారాలా? ఈ అననుకూల భావాలను ప్రచారం చేయడానికి సాహసిస్తున్న వారెవ్వరు? ఈ విధమైన ఆత్మవంచన అనేది వ్యాధికి మరోపేరు. మీరు దానిని నమ్రత అని చెప్తున్నారా? చేతకానితనానికి ఇది ఒక ముసుగు. మంచుకొండ విరిగిపడినట్లు మీరు ఈ లోకంపై విరుచుకు పడండి. మీ భారానికి ఈ ప్రపంచం రెండు ముక్కలుగా చీలిపోనీ గాక!



*If you have a clouded face do not go out that day, shut yourself up in your room. What right have you to carry this disease out into the world?*



మనోవ్యాకులత నీ ముఖాన ద్యోతకమవుతున్న రోజున బయటకు రాకుండా తలుపులేసుకొని గదిలో కూర్చో! ఈ వ్యాధిని ప్రపంచంలో వ్యాపింపజేయడానికి నీకేం 'హక్కు' ఉంది?

*What makes you weep, my friend? In you is all power. Summon up your all-powerful nature, O mighty one, and this whole universe will lie at your feet. It is the Self alone that predominates, and not matter.*

ఓ మిత్రమా! నిన్ను దుఃఖితునిగా చేస్తున్నది ఏది? సర్వ శక్తీ నీలోనే ఉంది. ఓ శక్తిశాలీ! నీ సర్వశక్తి స్వభావాన్ని వ్యక్తీకరించు. ఈ సమస్తలోకమూ నీకు పాదాక్రాంతమవుతుంది. శక్తిమంతమైనది ఆత్మే కాని, జడ పదార్థం కాదు.



*I feel as if a thunderbolt strikes me on the head when I hear people dwell on negative thoughts.*



వ్యతిరేక భావములను తలపోస్తున్న వారిని గూర్చి విన్నప్పడు నా తలపై పిడుగు పడిన భావన కలుగుతుంది.

You are strong, omnipotent, omniscient. No matter that you have not expressed it yet, it is in you. All knowledge is in you, all power, all purity, and all freedom - why cannot you express this knowledge? Because you do not believe in it... Believe in it, and it must and will come out.

నీవు బలాఢ్యుడవు, సర్వ శక్తిమంతుడవు, సర్వజ్ఞుడవు. ఆ శక్తిని నీవు ఇప్పటి వరకూ అభివ్యక్తం చేసి ఉండలేదు. కాని అది నీలోనే ఉంది. నీవు సర్వశక్తిమంతుడవు పరమ పవిత్రుడవు, నిత్య ముక్తుడవు. సమస్త జ్ఞానాన్ని నీయందే కలిగి ఉన్నవాడవు. ఈ జ్ఞానాన్ని నీవు ఎందుకు ప్రకటించలేవు? నీకు దీనిపై విశ్వాసం కలుగలేదు కనుక... విశ్వాసం ఏర్పడిన వెంటనే అది తప్పక అభివ్యక్తమై తీరుతుంది.



If you can think that infinte power, infinite knowledge and indomitable energy lie within you, and if you can bring out that power, you also can become like me.



నీవు కూడా ఆ అనంత శక్తి, అనంత జ్ఞానం, అప్రతిహతమైన ఉత్సాహం నీలో ఉన్నాయని తలుస్తూ ఆ శక్తిని బహిర్గతం చేయగలిగితే, నీవు కూడా నాలాగా అవగలవు.

*To think of any imperfection creates it. Thoughts of strength and perfection alone can cure it.*

లోపం ఉన్నదని భావించడమే లోపాన్ని సృజిస్తున్నది. బలము, పరిపూర్ణతల గురించి భావించడమే లోపాన్ని సరిదిద్దగలదు.



Struggle is the sign of life.



పోరాటమే జీవిత లక్షణం.

*For fear of defeat shall I retreat from the fight?*
*Defeat is the ornament the hero adorns himself with.*
*What, to acknowledge defeat without fighting!*

అపజయం కలుగుతుందని నేను పోరాటం నుండి పారిపోవాలా?
ధీరుడైనవాడు ధరించే ఆభరణమే ఓటమి. ఏమిటి?
యుద్ధం చేయకుండా పరాజయాన్ని అంగీకరించడమా?



*Perseverance will finally conquer.*
*Nothing can be done in a day.*



పట్టుదల వదలకుండా చేసే ప్రయత్నం
చివరకు విజయాన్ని చేకూరుస్తుంది.
ఒక్క రోజులో దేన్నీ సాధించలేం.

Mountain-high though the difficulties appear, terrible and gloomy though all things seem, they are but Maya. Fear not and it is banished. Crush it and it vanishes. Stamp upon it, and it dies. Be not afraid. Think not how many times you fail. Never mind, time is infinite... Go forward: assert yourself again and again, and light must come.

కష్టాలు పర్వతం అంతగా కనిపించినా, పరిస్థితులన్నీ భయంకరంగా, నిరాశాజనకంగా ఉన్నా అవి అన్నీ మాయే, భయపడ వద్దు. అది తొలిగిపోతుంది; అణచిపెట్టండి, అది అదృశ్యమవుతుంది; త్రొక్కివేయండి, అది అంతరిస్తుంది. భయపడకు! ఎన్ని సార్లు పరాజయాన్ని పొందానని ఆలోచించవద్దు. తలచవద్దు. కాలం అనంతం, ముందుకు సాగిపో! ఆత్మశక్తిని మాటి మాటికి భావించు, వెలుగు వచ్చే తీరుతుంది.



*Plod on through the dark, brave-heart, with all thy might and main.*



ధీర హృదయమా! నీ శక్తి సామర్థ్యాలన్నిటితో అంధకారాన్ని అధిగమించు.

The struggle is the great lesson. Mind you, the great benefit in this life is struggle. It is through that we pass. If there is any road to heaven, it is through hell. Through hell to heaven is always the way.

జీవితమే ఒక పోరాటం అని పాఠం. ఈ జీవితంలో మనం పొందదగిన మహత్తర ప్రయోజనం పోరాటమని గ్రహించండి. పోరాటం ద్వారానే మనం ముందుకు సాగిపోతాం. స్వర్గానికి మార్గమేదైనా ఉంటే, అది నరకం ద్వారానే. ఎప్పుడైనా సరే నరకం నుంచే స్వర్గానికి దారి.



*No need of looking behind. FORWARD! We want infinite energy, infinite zeal, infinite courage, and infinite patience, then only will great things be achieved.*

వెనక్కు చూడవలసిన పని లేదు. పురోగమించండి. మనకు కావలసినవి అనంతశక్తి, పట్టుదల, ధైర్యం మరియు అనంత సహనం; అప్పుడే మహాకార్యాలు సాధించబడతాయి.



*To suceed, you must have tremendous perseverance, tremendous will. "I will drink the ocean," says the persevering soul, "At my will mountains will crumble up." Have that sort of energy, that sort of will, work hard, and you will reach the goal.*

కార్యసిద్ధికి మీరు నిశ్చలమైన దీక్షను పూనాలి. అద్వితీయమైన సంకల్పాన్ని కనబరచాలి. కార్య తత్పరుడు "నేను సముద్రాన్ని త్రాగి వేస్తాను"అంటాడు. నేను సంకల్పిస్తే, పర్వతాలు చూర్ణం కావలసిందే" అని అంటాడు. ఇటువంటి వీర్యోత్సాహవంతుడవై, ఇటువంటి దృఢ సంకల్పాన్ని పూని తీవ్ర ప్రయత్నం చేయి. తప్పక గమ్యస్థానం చేరతావు. (పరమావధిని పొందుతావు.)



*The will is stronger than anything else. Everything must go down before the will, for, that comes from God and God Himself; the pure and a strong will is omnipotent.*



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నింటి కంటే బలవత్తరమైంది. అది సాక్షాత్తు భగవంతుని వద్ద నుండే వస్తుంది కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవాల్సిందే. పవిత్రము, దృఢము అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైనది.

*The world sympathises only with the strong and powerful.*

లోకం బలవంతులను, శక్తిమంతులను మాత్రమే ఆదరిస్తుంది.



*My child, what I want is muscles of iron and nerves of steel, inside which dwells a mind of the same material as that of which the thunderbolt is made. Strength, manhood, Kshatra Virya+ Brahma Teja ... this I want.*



నాయనా! నాకు కావలసినది ఇనుప కండలు, ఉక్కు నరములు. వానిలోపల వజ్రాయుధ సమమయిన మనస్సు, బలము, పౌరుషము, క్షాత్రవీర్యము, బ్రహ్మతేజము - ఇవి నాకు కావల్సింది.

*Men, men, these are wanted; everything else will be ready, but strong, vigorous, believing young men, sincere to the backbone, are wanted. A hundred such and the world becomes revolutionised.*

ఇప్పుడు కావలసింది పురుషులు మాత్రమే అని గ్రహించండి. తక్కినదంతా సిద్ధంగా దొరకగలదు, కాని బలిష్ఠులు, జవ సంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మవిశ్వాసపరులూ అయిన యువకులు కావలసి ఉన్నారు. అటువంటి వారు వందమంది దొరికినా ప్రపంచంలో గొప్ప మార్పును తీసుకు రావచ్చు.



*It is gentleness that has the strength to live on and to fructify, and not mere brutality and physical force.*



సాధువర్తనమే చిరకాలం మనగలిగి ఫలవంతమవడానికి తగిన శక్తి కలిగి ఉంది. దౌర్జన్యానికి, హింసకు అటువంటి శక్తి లేదు.

*Men should be taught to be practical, physically strong. A dozen such lions will conquer the world, not millions of sheep.*

జనులను బలిష్ఠులుగా, కార్యాచరణపరులుగా చేయాలి. సింహసదృశులైనటువంటి కొద్దిమంది ప్రపంచాన్ని జయిస్తారు గానీ, లక్షలకొద్దీ గొఱ్ఱెల మందలు కాదు.



I want iron wills and hearts that do not know how to quake.



పరాజయమే ఎరుగని దృఢసంకల్పులు,
ధీర హృదయులూ నాకు కావాలి.

*Give me a few men and women who are pure and selfless and I shall shake the world.*

పవిత్రులు, స్వార్థ రహితులు అయిన కొద్దిమంది స్త్రీ పురుషులను నాకివ్వండి. నేను ప్రపంచాన్ని కదిలిస్తాను.



*Strength, strength, it is that we want so much in this life, for what we call sin and sorrow have all one cause, and that is our weakness. With weakness comes ignorance, and with ignorance comes misery.*

మనకు ఈ జీవితంలో అత్యధికంగా కావల్సింది బలం, శక్తి. మనం ఏదైతే పాపం, దుఃఖం అంటున్నామో అవన్నీ బలహీనతే ఏకైక కారణంగా ఉన్నాయి. బలహీనతతో అజ్ఞానం వస్తుంది. అజ్ఞానంతో దుఃఖం కలుగుతుంది.



Never be weak. You must be strong;
you have infinite strength within you.

ఎన్నడూ బలహీనులుగా ఉండకండి.
మీరు శక్తి సమన్వితులై ఉండాలి.
మీలో అనంతశక్తి ఇమిడి ఉంది.



The only saint is that soul that never weakens and faces everything.

దౌర్బల్యమునకు వశుడు కాక, దేనినైనా ఎదుర్కొంటూ తుదివరకూ పట్టు విడువకుండా ఉండేవాడే యోగి,



*Know that all sins and all evils can be summed up in that one word, weakness. It is weakness that is the motive power in all evil-doing; it is weakness that is the source of all selfishness; it is weakness that makes men injure others; it is weakness that makes them manifest what they are not in reality.*



పాపములన్నీ, అనర్థాలన్నీ, 'దుర్బలత' అనే ఒక్కమాటలో ఇమిడి ఉన్నాయి. అన్ని దోషపూరిత కార్యాలకూ ప్రేరణశక్తి దుర్బలతే. స్వార్థపరత అంతటికీ మూలం దౌర్బల్యమే. ఇతరులకు అపకారం చేయడానికి మనుషులను ప్రేరేపించేది దుర్బలతే. సత్యాన్ని కప్పిపెట్టి  కపట వేషాలను దాల్చునట్లు చేసేది దౌర్బల్యమే.

*You must retain great strength in your mind and words. "I am low, I am low"- repeating these ideas in the mind, man belittles and degrades himself.*

మీ మనస్సులో, మాటలలో గొప్ప శక్తిని ఉంచుకోవాలి. "నేను అల్పుడను, నేను అల్పుడను" - అని మళ్ళీ మళ్ళీ ఇలాంటి భావాలను మనస్సులో జపిస్తూ మనిషి తనను తాను కించపరచుకుంటాడు, దిగజార్చుకుంటాడు.



*Sin may be said to be the feeling of every kind of weakness. From this weakness spring jealousy, malice, and so forth. Hence weakness is sin.*



ప్రతి బలహీనత నుంచీ పాప భావమే వ్యక్తమౌతుంది. ఈ బలహీనత నుంచే అసూయ, దౌష్ట్యం ఇంకా ఇతరమైనవి పుట్టుకొస్తాయి. అందువల్ల బలహీనతయే పాపం.

*What we want is strength, so believe in yourselves... Make your nerves strong. What we want is muscles of iron and nerves of steel. We have wept long enough. No more weeping, but stand on your own feet and be men.*

మనకు కావలసింది బలం, కాబట్టి ఆత్మవిశ్వాసం కలిగి ఉండండి... మీ నరాలను దృఢతరం చేసుకోండి. మనకు కావలసింది ఇనుప కండలు, ఉక్కు నరాలు. మనం చాలా కాలం విలపించాం. విలపించినది చాలు, మీ కాళ్లపై మీరు నిలబడి మనుష్యులుగా ఎదగండి.



*What is sin and what is misery, and what are all these, but the results of weakness?... Men are taught from childhood that they are weak and sinners. Teach them that they are all glorious children of immortality, even those who are the weakest in manifestation. Let positive, strong, helpful thoughts enter into their brains from very childhood. Lay yourselves open to these thoughts, and not to weakening and paralysing ones.*



పాపమేమిటి? దుఃఖమేమిటి? ఇవన్నీ బలహీనత ఫలితం గాక మరేమిటి? బాల్యం నుంచీ వారు బలహీనులనీ, పాపులనీ జనులకు బోధించడం జరిగింది. అభివ్యక్తీకరణలో బలహీనమైన వారితో సహా అందరికీ వారంతా అమృత పుత్రులని బోధించండి. ఆశాజనకమైన, బలమైన, ఉపయోగకరమైన ఆలోచనలు వారి మెదడులోకి చిన్నప్పటి నుండీ చొరనివ్వండి. బలహీనమైన, స్తబ్దతను కలిగించే ఆలోచనలను కాక ఈ ఆలోచనలను గ్రహించడానికి సిద్ధంగా ఉండండి.

First build up your physique. Then only you can get control over the mind.

ముందు శరీరదారుఢ్యాన్ని పెంచుకోండి.
అప్పుడు మనస్సుపై నిగ్రహాన్ని సాధించవచ్చు.



*Never can hatred and malice vanish from one's heart unless one becomes a hero.*



మనిషి ధీరుడైతే తప్ప ద్వేషం, అపకార బుద్ధి హృదయం నుండి తొలగిపోవు.

*It is very easy to say, "Hate nobody, resist not evil," but we know what that kind of thing generally means in practice. When the eyes of society are turned towards us, we may make a show of non-resistance, but in our hearts it is canker all the time... This is hypocrisy and will serve no purpose.*

"ఎవరినీ ద్వేషించవద్దు, చెడును ప్రతిఘటించవద్దు" అని చెప్పడం తేలికే కానీ ఆచరణ విషయానికొస్తే ఇదెలాంటిదో మనకు తెలుసు. సమాజ దృష్టి మనపై ఉన్నప్పుడు వ్యతిరేకత లేనట్లు మనం నటించవచ్చు. కాని మన హృదయం విద్వేషంతో కూడుకొని ఉంటుంది... ఇది కపటత్వం. దీని వల్ల ఏమీ ప్రయోజనం కలుగదు.



*This is the one question I put to every man, women, or child, when they are in physical, mental, or spiritual training. Are you strong? Do you feel strength? - for I knew it is strength alone that leads to truth.*



భౌతిక, మానసిక లేదా ఆధ్యాత్మిక శిక్షణను తీసుకుంటున్నప్పుడు ప్రతి పురుషుణ్ణి, స్త్రీని, బాలుణ్ణి నేను అడిగే ప్రశ్న ఒక్కటే - మీరు బలంగా ఉన్నారా? బలం మీకు అనుభూతమౌతుందా?.... బలమే సత్యానికి చేరువుగా తీసుకువెళుతుందని నాకు తెలుసు.

*Stamping down the weakness of mind and heart, stand up, saying, "I am possessed of heroism, I am possessed of a steady intellect..." Never allow weakness to overtake your mind.*

హృదయ దౌర్బల్యాన్ని, మానసిక బలహీనతను అధిగమించి లెమ్ము! "నేను ధీరత్వాన్ని కలిగి ఉన్నాను, నేను స్థిర బుద్ధిని కలిగి ఉన్నాను..." అంటూ బలహీనత ఎప్పుడూ మీ మనస్సును అధిగమించకుండా చూసుకోండి.



*Strength is the medicine for the world's disease. Strength is the medicine which the poor must have when tyrannised over by the rich. Strength is the medicine that the ignorant must have when oppressed by the learned.*



ప్రపంచంలోని రుగ్మతలకు మందు - బలం. ధనికులచే పీడింపబడినప్పుడు పేదల దగ్గర ఉండవలసిన మందు - బలం. పండితులచే అణగద్రొక్కబడినప్పుడు పామరులకు కావలసిన మందు - బలం.

*First you have to build the body by good nutritious food - then only will the mind be strong. The mind is but the subtle part of the body.*

ముందు నీవు పౌష్టికాహారం తీసుకొని దేహ దారుఢ్యాన్ని పెంపొందించుకోవాలి. అప్పడే మనస్సు బలంగా ఉంటుంది. శరీరం యొక్క సూక్ష్మరూపమే మనస్సు.



The only test of good things is that they make us strong.



మంచి విషయాలు మనల్ని బలోపేతులుగా చేస్తాయి. ఇదే వాటికి ప్రమాణం.

*As soon as you say, "I am a little mortal being," you are saying something which is not true, you are giving the lie to yourselves, you are hypnotising yourselves into something vile and weak and wretched.*

"నేను ఒక చిన్న అశాశ్వత జీవిని" అనుకున్న వెంటనే నీవు ఒక అసత్యాన్ని పలుకుతున్నావు. అబద్ధాన్ని ప్రబోధించుకుంటున్నావు. నీవు ఒక దుర్బలుడవని, అల్పుడవని, దుష్టుడవని సమ్మోహ పరచుకుంటున్నావు.



The infinite strength of the world is yours. Drive out the superstition that has covered your minds. Let us be brave.



ప్రపంచంలోని అనంత శక్తి మీదే. మీ మనస్సులను కప్పివేసిన మూఢ నమ్మకాన్ని పారద్రోలండి. మనం ధైర్యంగా ఉందాం.

*By degrees the heart has to be strengthened. If one man is made, it equals the result of a thousand lectures.*

కొద్ది కొద్దిగా హృదయంలో బలాన్ని నింపాలి. ఒక్క మనిషిని తయారు చేయగలిగితే అది వేయి ఉపన్యాసాల ఫలితానికి సమానం.



*Whatever you think, that you will be. If you think yourselves weak, weak you will be; if you think yourselves strong, strong you will be; if you think yourselves impure, impure you will be; if you think yourselves pure, pure you will be. This teaches us not to think ourselves as weak, but as strong, omnipotent, omniscient.*



మీరు ఏ విధంగా భావిస్తే ఆ విధంగా అవుతారు. మిమ్మల్ని మీరు బలహీనులుగా భావించుకుంటే, బలహీనులుగానే ఉంటారు. మిమ్మల్ని మీరు శక్తిమంతులుగా భావిస్తే, శక్తిమంతులుగా అవుతారు. అపవిత్రులుగా మిమ్మల్ని మీరు భావించుకుంటే అపవిత్రులుగా మారతారు. మిమ్మల్ని మీరు పవిత్రులుగా సంకల్పించుకుంటే పవిత్రతను పొందుతారు. మనల్ని మనం బలహీనులుగా కాకుండా బలవంతులుగా, సర్వ శక్తిమంతులుగా, సర్వజ్ఞులుగా భావించు-కోవాలని ఇది తెలియజేస్తుంది.

*In spite of the greatness of the Upanishads, in spite of our boasted ancestry of sages, compared to many other races, I must tell you that we are weak, very weak. First of all is our physical weakness. That physical weakness is the cause of atleast one-third of our miseries.*

ఉపనిషత్తులు గొప్పవైనప్పటికీ, పురాతన ఋషి సంప్రదాయమని డాంభికంగా మనం చెప్పినప్పటికీ మిగతా జాతులతో పోలిస్తే మనం బలహీనులమనీ, అతి బలహీనులమనీ నేను చెబుతాను. మన శారీరక బలహీనత మొదటిది. మన బాధలలో మూడులో ఒక వంతు వాటికి కారణం శారీరక బలహీనతే!



*We speak of many things parrot-like, but never do them; speaking and not doing has become a habit with us. What is the cause of that? Physical weakness. This sort of weak brain is not able to do anything; we must strengthen it.*



చిలకలాగా మనం చాలా వాటి గురించి మాట్లాడతాం. కాని వాటిని ఎప్పుడూ ఆచరించం. మాట్లాడటమే గానీ ఆచరించకపోవడం మనకొక అలవాటుగా మారింది. దీనికి కారణం ఏమిటి? శారీరక బలహీనత. ఈ రకమైన బలహీన మనస్సు ఏదీ చేయలేకున్నది. మనం దీనిని బలోపేతం చేయాలి.

*You are lions, you are souls, pure, infinite, and perfect. The might of the universe is within you. Why weepest thou my friend?*

మీరు సింహాలు, మీరు పరిపూర్ణులు, పవిత్రులు, అనంతాత్ములు. విశ్వంలోని శక్తి అంతా మీలో ఉంది. ఎందుకు విలపిస్తావు మిత్రమా?



*The brain and muscles must develop simultaneously. Iron nerves with an intelligent brain - and the whole world is at your feet.*



మనస్సు, కండరాలు రెండూ ఒకేసారి అభివృద్ధి చెందాలి. ఇనుప నరాలు, కుశాగ్ర బుద్ధి - ఇవి ఉంటే ప్రపంచం మీ పాదాక్రాంతమవుతుంది.

*You must learn to make the physique very strong and teach the same to others... Body and mind must run parallel... When the necessity of strengthening the physique is brought home to people, they will exert themselves of their own accord.*



శరీర సౌష్ఠవాన్ని కలిగి ఉండండి. ఇతరులకు కూడా బోధించండి... శరీరం, మనస్సు సమానంగా పెంపొందాలి... శరీర సౌష్టవ ఆవశ్యకతనుప్రజలకు తెలియజెప్పినట్లైతే వారంతట వారు దేహదారుఢ్యానికై శ్రమిస్తారు.

*This is not the time with us to weep even in joy; we have had weeping enough; no more is this the time for us to become soft. This softness has been with us till we have become like masses of cotton and are dead. What our country now wants are muscles of iron and nerves of steel, gigantic wills which nothing can resist, which can penetrate into the mysteries and the secrets of the universe, and will accomplish their purpose in any fashion even if it meant going down to the bottom of the ocean and meeting death face to face.*



ఆనంద బాష్పాలను రాల్చడానికి కూడా ఇది కాలం కాదు. చాలినంత కాలం ఏడ్చాం! సుతిమెత్తగా ఉండడానికి ఇది ఎంతమాత్రం సమయం కాదు. ఈ మృదు స్వభావం మనల్ని చివరకు దూది కుప్పగా మార్చి మృతప్రాయులుగా చేసింది. మన దేశానికి ఇప్పుడు కావలసింది - ఇనుప కండరాలు, ఉక్కు నరాలు, విశ్వరహస్యాలలోకి, గూఢాంతరాళాలలోకి చొచ్చుకొనిపోయి ఏదో విధంగా ప్రయోజనాన్ని సాధించగలిగే, అంటే ఈ క్రమంలో సముద్రపు లోతుల్లోకి పోయి మృత్యువుతో ముఖాముఖి తలపడవలసి వచ్చినా, ఏదీ నిరోధించలేని బృహత్సంకల్పాలు.

*If you, my sons, can proclaim this message to the world - "Yield not to unmanliness, O son of Partha; it does not befit thee" - then all this disease, grief, sin and sorrow will vanish off from the face of the earth in three days.*



పుత్రులారా! మీరు కనుక "ఓ కుంతీ పుత్రుడా! దౌర్బల్యానికి దాసోహమనవద్దు. అది నీకు తగినది కాదు" అన్న సందేశాన్ని ప్రపంచానికి చాటితే అప్పుడు రోగం, దుఃఖం, పాపం, మరియూ బాధలన్నీ ఈ భూమిపై నుంచి అంతరించి పోతాయి.

*That is all I have to say to the world. Be strong!... The sign of life is strength and growth. The sign of death is weakness. Whatever is weak, avoid! It is death! If it is strength, go down into hell and get hold of it!*



ప్రపంచానికి నేను చెప్పదలచుకున్నది ఇదే - బలంగా ఉండండి. బలం అభివృద్ధి జీవన లక్షణాలు. బలహీనత మరణ సంజ్ఞ. బలహీనమైన దానిని త్యజించండి! అది మృత్యువు! అది శక్తియుతమైతే నరకానికి వెళ్ళి అయినా దానిని గ్రహించండి.

*Be strong. Be manly. I have respect even for a wicked person so long as he is manly and strong, for his strength will someday make him give up his wickedness, and even renounce all work for selfish ends. It will thus eventually bring him to the Truth.*

బలంగా, ధీరులుగా ఉండండి. బలంగా, ధీరుడిగా ఉన్నవాడు దుర్మార్గుడైనప్పటికీ నేను గౌరవిస్తాను. అతడిలోని ఆ శక్తి ఏదో ఒక రోజు అతడిని చెడు నడత నుండి విముక్తుణ్ణి చేస్తుంది. స్వార్థం కోసం పని చేయడం కూడా అతడు మానుకుంటాడు. ఇది క్రమంగా అతడిని సత్యానికి చేరువ చేస్తుంది.



*The sign of vigour, the sign of life, the sign of hope, the sign of health, the sign of everything that is good, is strength.*



బలమే వీరాంక్యం, బలమే జీవన సంజ్ఞ,
బలమే ఆశావహక దృక్పథం, బలమే ఆరోగ్య లక్షణం,
శ్రేయస్కరమైన ప్రతిదానికీ సంజ్ఞ బలమే.

*This I lay down as the first essential in all I teach: anything that brings spiritual, mental, or physical weakness, touch it not with the toes of your feet.*

నేను బోధించే వాటిలో ఇది ప్రధానమైనదిగా నొక్కి చెబుతాను : ఆధ్యాత్మిక, మానసిక, శారీరక దౌర్బల్యం కలిగించే దేనిని కూడా నీ కాలి బొటనవ్రేలితో అయినా ముట్టవద్దు.



*Are not drums made in the country? Are not trumpets and kettle-drums available in India? Make the boys hear the deep-toned sound of these instruments. Hearing from boyhood the sound of these effeminate forms of music the country is well-nigh converted into a country of women. What more degradation can you expect ? Even the poet's imagination fails to draw this picture!*



ఈ దేశంలో భేరీలు తయారు చెయ్యటం లేదా? బాకాలు, ఢంకాలు ఈ దేశంలో దొరకటం లేదా? ఈ వాద్యాలలో నుండి వచ్చే గంభీరనినాదాలను మన పిల్లలను విననివ్వండి. చిన్నప్పటినుండి ఈ కోమల సంగీతాలు విని దేశం దాదాపు అబలల దేశంగా మారిపోయింది. ఇంతకంటే ఇంకేం పతనాన్ని ఆశిస్తున్నావు? ఈ చిత్రాన్ని చిత్రించటానికి కవి హృదయం కూడా చాలదు.

*The Damaru and horn have to be sounded, drums are to be beaten so as to raise the deep and martial notes... the music which awakens only the softer feelings of man is to be stopped now for some time. stopping the light tunes the people are to be accustomed to hear the dhrupad music. Through the thunder-roll of the dignified Vedic hymns, life is to be brought back into the country. In everything the austere spirit of heroic manhood is to be revived. In following such an ideal lies the good of the people and the country.*

ఢమరులు వాయించాలి, కొమ్ములు ఊదాలి, భేరీలు మ్రోగించాలి, గంభీర యుద్ధనినాదాలు చెలరేగాలి.... మానవునిలోని సున్నిత భావాలను రేకెత్తించే సంగీతం యిప్పుడు కొంతకాలం ఆపి ప్రజలు 'ధ్రుపద' సంగీతాన్ని వినేటట్లు అలవాటు చెయ్యాలి. గంభీరమైన వేదబుక్కుల మేఘగర్జనలతో దేశానికి ప్రాణం పొయ్యాలి. ప్రతి విషయంలోను వీరోచితమైన పురుషత్వాన్ని పునరుజ్జీవింప చెయ్యాలి. ఈ ఆదర్శాన్ని అనుసరించటం దేశము మరియు ప్రజల అభ్యున్నతికి కారణభూతమవుతుంది.



*[When a disciple pleaded helpless, Swamiji thundered]*

*What nonsense are you talking? Within you lies indomitable power. Only thinking, 'I am nothing, I am nothing,' you have become powerless.*

(ఒక శిష్యుడు తాను అసహాయుడనని అన్నప్పుడు, స్వామీజీ ఈ విధంగా గర్జించారు.)

ఎంతటి అర్థరహిత ప్రలాపన? నీలో అప్రతిహతమైన శక్తి ఉంది. "నేను అసమర్థుడను, నేను అసమర్థుడను" అని ఆలోచిస్తూ మీరు శక్తిహీనులయ్యారు.



*You do not deserve to live if you cannot help yourselves.*

మిమ్మల్ని మీరు ఉద్ధరించుకోకపోతే మీకు జీవించే అర్హత లేనట్లే.



*It is diabolism to say, "I am so miserable." Every man has his own burden to bear. If you are miserable, try to conquer it, try to be happy.*

"నేను బాధాతప్తుడను" అని భావించడం గర్హనీయం. మోయడానికి ప్రతి వ్యక్తికీ తన బరువు తనకుంది (ఎవరికి తగ్గ కష్టాలు వారికి ఉన్నాయి). నీవు దుఃఖితుడవైతే, దాన్ని అధిగమిస్తూ సంతోషంగా ఉండడానికి ప్రయత్నం చేయి.



Stand up, be bold, be strong. Take the whole responsibility on your own shoulders, and know that you are the creator of your own destiny.  All the strength and succour you want is within yourselves.



లేచి నిలబడు, ధైర్యంగా బలిష్ఠంగా ఉండు. మొత్తం బాధ్యతనంతా నీ భుజస్కంధాల మీదనే వేసుకో. నీ భవిష్యత్తుకు నీవే బాధ్యుడవని తెలుసుకో. నీకు కావలసిన బలం, శక్తి... అన్నీ నీలోనే ఉన్నాయి.

*It is a tremendous error to feel helpless. Do not seek help from anyone. We are our own help. If we cannot help ourselves, there is none to help us... this is the last and greatest lesson, and oh, what a time it takes to learn it!... Just think of that huge mass of misery, and all caused by this false idea of going to seek for help!*

నిస్సహాయుడిగా భావించడం ఘోరమైన తప్పు.
ఇతరుల నుండి సహాయాన్ని ఆశించకు. మనకు మనమే సహాయం చేసుకోవాలి. అది చేయకపోతే మనకు ఎవరూ సహాయపడరు. ఇదే ఆఖరి-గొప్ప పాఠం. హా! ఇది నేర్చుకోవడానికి ఎంత సమయం పడుతున్నది! చూడు జనులలో దైన్యతకంతటికీ కారణం ఇతరుల సహాయం కోసం అఱ్ఱులు చాచడమే.



There is no help for man. None ever was, none is, and none will be... But you are spirit. Pull yourself out of difficulties by yourself! Save yourself by yourself! There is none to help you - never was. To think that there is, is sweet delusion. It comes to no good.



మనిషికి సహాయం అంటూ ఏదీ లేదు. ఇంతకు ముందు ఎన్నడూ లేదు, ఇప్పుడూ లేదు, ఇకపై ఉండదు. నీవు అనంతశక్తి సమన్వితుడవు, నీలోని శక్తి ద్వారానే నీ కష్టాల నుండి బయటపడాలి. నిన్ను నీవే రక్షించుకోవాలి. నీకు సహాయం చేసే వారెవరూ ఎన్నడూ లేరు. అలా ఉన్నారని భావించడం ఒక మధురభ్రాంతి. దీని వలన ఏ మేలూ ఒనగూరదు.

*You may pray to everyone that was ever born, but who will come to help you?... Help thyself out by thyself. None else can help thee, friend... Get hold of the Self, then. Stand up. Don't be afraid. In the midst of all miseries and all weakness, let the Self come out, faint and imperceptible though it be at first.*

ఇప్పటి వరకూ జన్మించిన ప్రతివారినీ మీరు ప్రార్థించవచ్చు, కాని మీకు సహాయపడడానికి ఎవరొస్తారు?... మీకు మీరే సహాయకారిగా ఉండాలి. నీకెవరూ సహాయం చేయలేరు మిత్రమా... కాబట్టి ఆత్మను ఆధారంగా గ్రహించు. లే! భయపడకు! మొదట అస్పష్టం, అగ్రాహ్యం అనిపించినా, ఈ దుఃఖాల మధ్య నుండీ, ఈ బలహీనతల నడుమ ఆత్మను జాగృతమవనిద్దాం.



The one great question asked by Vedanta is: why are people so afraid? The answer is that they have made themselves helpless and dependent on others. We are so lazy, we do not want to do anything for ourselves. We want a personal god, a saviour or a prophet to do everything for us... If everything is done for a man by another he will lose the use of his own limbs. Anything we do ourselves, that is the only thing we do. Anything that is done by another never can be ours... All this running after help is foolishness.



ప్రజలు భయస్థులుగా ఎందుకున్నారని వేదాంతం ప్రశ్నిస్తోంది. దానికి సమాధానం - 'వారికి వారే నిస్సహాయులుగా మారి, ఇతరులపై ఆధారపడడమే!' మనం మనకోసం కూడా ఏమీ చేసుకోలేని సోమరులం. మనకు అన్నీ చేసే ఇష్ట దేవత, రక్షకుడు, ప్రవక్త ఒకరు కావాలి. ఒక మనిషికి మరొకరు అన్నీ చేసిపెడితే ఆ మనిషి కాళ్ళూచేతులూ పనికిరాకుండా పోతాయి. మనకై మనం చేస్తేనే మనం ఒనర్చినట్లు అవుతుంది. ఇంకొకరు చేసినదేదైనా ఎప్పుడూ మనదవ్వదు... ఈ సహాయానికై పరుగులిడడం అంతా మూర్ఖత్వం.

*You Know, there are bullock carts... sometimes a sheaf of straw is dangled at the tip of the pole, a little in front of the bulls but beyond their reach. The bulls try continually to feed upon the straw, but never succeed. That is exactly how we are helped ! We think we are going to get security, strength, wisdom, happiness from the outside. We always hope but never realize our hope. Never does any help come from the outside.*

ఎడ్ల బండ్లు మీకు తెలుసు... కొన్నిసార్లు ఒక గడ్డిమోపును పోలుగఱ్ఱ చివర ఎద్దులకు ముందు వాటికి అందనంత దూరంలో వ్రేలాడగడతారు. ఎద్దులు ఈ గడ్డి మోపును మేద్దామనుకుంటాయి. కాని దానిని చేరుకోలేవు. అవి గడ్డి మోపును తినడానికి ప్రయత్నిస్తూనే ఉంటాయి. కాని వాటి ప్రయత్నం ఫలించదు. మనం పొందే సహాయం కూడా ఆ విధమైనదే ! మనం భద్రతను, శక్తిని, జ్ఞానాన్ని, సంతోషాన్ని బయటనుంచి పొందుదామనుకుంటాం. మనం ఆశిస్తాం గానీ మన ఆశ ఎప్పడూ నెరవేరదు. బయటనుంచి ఎన్నడూ ఏ సహాయమూ రాదు.



We human beings are very slow to recognise our own weakness, our own faults, so long as we can lay the blame upon somebody else. Men in general lay all the blame of life on their fellow-men, or, failing that, on God, or they conjure up a ghost, and say it is fate. Where is fate, and what is fate? We reap what we sow. We are the makers of our own fate. None else has the blame, none has the praise.



మనం ఎంతకాలమైతే ఇతరులపై నిందలను మోపుతామో - అంతవరకు మన బలహీనతలను, తప్పులను మనం గుర్తించలేం! సాధారణంగా జనులు తమ దుస్థితికి కారణం ఇతరులే అంటూ నిందారోపణ చేస్తారు. లేదంటే భగవంతుణ్ణి నిందిస్తారు. లేకపోతే 'నా తలరాత' అని ఒక భూతాన్ని ఊహిస్తారు. విధి ఎక్కడ, విధి ఏమిటి? మనం ఏది నాటితే అదే పండుతుంది. మన విధికి మనమే కారకులం. ఎవరినీ నిందించడానికి లేదు, స్తుతించడానికి లేదు.

*You know in your inmost heart that many of your limited ideas, this humbling of yourself and praying and weeping to imaginary beings are superstitions. Tell me one case where these prayers have been answered. All the answers that came were from your own hearts.*

మీ పరిమిత భావాలు చాలా వరకు, కల్పిత దేవుళ్ల ముందు ఈ ప్రార్థనలు, ఈ ఏడుపులు, మిమ్మల్ని మీరు దాస్యమొనర్చుకోవడం - అన్నీ కూడా మూఢ నమ్మకాలు అని మీకు అంతరాంతరాళాల్లో తెలుసు. ఒక్క సందర్భంలోనైనా ఈ ప్రార్థనలు ఆలకించబడ్డాయేమో చెప్పండి. మీకు దొరికిన సమాధానాలన్నీ మీ హృదయంలో నుంచే వచ్చాయి.



*In your ignorance, every prayer that you made and that was answered, you thought was answered by some being, but you answered the prayer yourself unknowingly. The help came from yourself, and you fondly imagined that someone was sending help to you. There is no help for you outside of yourself; you are the creator of the universe... These are words that will burn up the dross that is in the mind, words that will bring out the tremendous energy which is within you already, the infinite power which is sleeping in your heart.*



ఆలకింపబడ్డ నీ ప్రతి ప్రార్థనా ఏదో మానవేతర శక్తి ఆలకించిందని నీ అజ్ఞానంలో అనుకున్నావు. కాని నీవే నీ ప్రార్థనను తెలియకుండానే సఫలీకృతం చేశావు. సహాయం నీనుండే అందింది. ఎవరో సహాయాన్ని అందిస్తున్నారని చక్కగా భావించావు. నీకు నీవు తప్ప బాహ్యసహాయకారి ఏదీ లేదు. 'నీవు సృష్టికర్తవు'... ఈ మాటలు నీ మనస్సులో ఉన్న మాలిన్యాన్ని దహించి, నీ హృదయంలో నిద్రాణమై ఉన్న అనంతశక్తిని జాగృతపరుస్తాయి.

*Those that blame others - and alas! the number of them is increasing everyday - are generally miserable with helpless brains; they have brought themselves to that pass through their own mistakes and blame others, but this does not alter their position. It does not serve them in any way. This attempt to throw the blame upon others only weakens them the more. Therefore, blame none for your own faults, stand upon your own feet, and take the whole responsibility upon yourselves. Say, "This misery that I am suffering is of my own doing, and that very thing proves that it will have to be undone by me alone."*

ఇతరులను నిందించేవారు (తమ కష్టాలకు) - దురదృష్టవశాత్తు వారి సంఖ్య రోజురోజుకూ పెరుగుతున్నది - అసహాయ మనస్సులతో బాధనొందుతుంటారు. తమ తప్పిదాలతోనే వాళ్ళు ఆ పరిస్థితిని కలిగించుకొని ఇతరులను నిందిస్తారు. ఇతరులపై నిందలను మోపే ఈ నైజం వారిని మరింత బలహీన పరుస్తుంది. కాబట్టి మీ తప్పలకు ఇతరులను నిందించకుండా మీ కాళ్లపై మీరు నిలబడి పూర్తి బాధ్యతను మీపై వేసుకోండి. "నేను అనుభవిస్తున్న ఈ బాధ స్వయంకృతం, కాబట్టి ఈ పరిస్థితిని వెనక్కు మార్చవలసింది కూడా నేనేనని అది నిరూపిస్తున్నద"నని పలకండి.



*You have cried to all the gods in the world. Has misery ceased? The masses in India cry to sixty million gods, and still die like dogs. Where are these gods? The gods come to help you when you have succeeded. So what is the use? This bending the knee to superstitions, this selling yourself to your own mind does not befit you, my soul. You are infinite, deathless, birthless. Because you are infinite spirit, it does not befit you to be a slave... Arise! Awake!*



ఈ ప్రపంచంలో ఉన్న దేవుళ్లందరి ముందూ మీరు విలపించారు. దుఃఖం తొలగిపోయిందా? భారతదేశంలోని జనబాహుళ్యం ఆరుకోట్ల దేవతలను ప్రార్థించీ కుక్క చావు చస్తుంటారు. ఈ దేవుళ్ళు ఎక్కడున్నారు? నీవు విజయం సాధించిన తరువాత నీకు సహాయం చేయడానికి వస్తారు. ఏం ప్రయోజనం? ఓ ఆత్మ స్వరూపా! ఈ మూఢ సమ్మకాలకు తలవొగ్గటం, మనస్సుకు దాసోహం అనడం నీకు తగనిది. నీవు అనంతుడవు, అమరుడవు. నీవు అనంతాత్మవు కాబట్టి బానిసగా ఉండడం నీకు సరిపడదు....లే! జాగృతుడవు కా!

*No books, no scriptures, no science can ever imagine the glory of the Self that appears as man, the most glorious God that ever was, the only God that ever existed, exists, or ever will exist... Whenever you see a weak man, weeping and wailing for help from somewhere above the skies, it is because he does not know that the skies also are in him. He wants help from the skies, and the help comes... but it comes from within himself, and he mistakes it as coming from without.*

ఏ పుస్తకాలూ, ఏ శాస్త్రాలూ, ఏ విజ్ఞానశాస్త్రం కూడా మనిషిగా కనిపిస్తున్న ఆత్మ వైభవాన్ని ఎప్పటికీ ఊహించలేవు. మనిషే ఇప్పటి వరకూ ఉన్న వైభవోపేతమైన దైవం. ప్రస్తుతం ఉన్న, ఇక ముందు ఉండబోతున్న దైవం కూడా మనిషే! ఏడుస్తూ ఆక్రందిస్తూ, ఆకాశంపైన ఎక్కడ నుండో సహాయం కోసం చూస్తూ ఉన్న బలహీనుణ్ణి మీరెప్పుడు చూసినా, ఆకాశాలు కూడా తనలోనే ఉన్నాయని తెలియకపోవడం వలననే అలా ఏడుస్తున్నాడని గ్రహించండి. పై నుండి సహాయాన్ని కోరుకుంటాడు... సహాయం అందుతుంది... తనలో నుండే ఆ సహాయం వస్తుంది. కానీ అతడు బయట నుండి ఆ సహాయం వస్తుందని భావిస్తాడు.



Education is not the amount of information that is put into your brain and runs riot there, undigested, all your life. We must have life-building, man-making, character-making assimilation of ideas. If you have assimilated five ideas and made them your life and character, you have more education than any man who has got by heart a whole library.

విద్య అంటే మీ మెదడులో దట్టింపబడి జీవితకాలం పాటూ అర్థంకాకుండా జీర్ణంకాక మనసును కల్లోలపరిచే సమాచార రాశి కాదు, నానా విషయాల కలగూరగంప కాదు. మనకు కావలసింది ఉజ్జీవనకరం, ధైర్య వీర్య జనకం, శీల నిర్మాణ సమర్థం అయిన భావాలు (వీటిని అందించేదే నిజమైన విద్య). అటువంటి ఐదు భావాలను గ్రహించి వాటిని మీ జీవితంగా, వ్యక్తిత్వంగా మలచుకోగలితే ఒక పెద్ద గ్రంథాలయాన్ని కంఠస్థం చేసినవాడి కంటే విశేష విద్యావంతులనదగ్గ వారుగా దీప్తిస్తారు.



Every ideal that strengthens you must be taken up and every thought that weakens you must be rejected.



మిమ్మల్ని బలవంతులుగా చేసే
ప్రతి ఆశయాన్ని స్వీకరించండి.
బలహీనపరిచే ప్రతి ఆలోచననూ తిరస్కరించండి.

*What we want is muscles of iron and nerves of steel. We have wept long enough. No more weeping, but stand on your feet and be men. It is a man-making religion that we want. It is man-making theories that we want. It is man-making education all round that we want.*

మనకు కావలసింది ఇనుప కండరాలు, ఉక్కు నరాలు. మనం దీర్ఘకాలం శోకించాం. ఇక చాలు! లేచి మీ కాళ్లపై మీరు ధీరులుగా నిలవండి! ఇప్పడు మనకు కావలసినది వ్యక్తులుగా వికసింపజేసే సిద్ధాంతాలు, మనుష్యులుగా తీర్చిదిద్దే మతం, ధీరులుగా తయారుచేసే విద్య.



*The remedy for weakness is not brooding over it, but thinking of strength. Teach men of the strength that is already within them.*



బలహీనతకు విరుగుడు బలం గురించి ఆలోచించడమే కానీ బలహీనతను చింతించడం కాదు. తమలోనే అంతర్గతంగా ఉన్న శక్తి గురించి జనులందరికీ ప్రబోధించండి.

*The powers of the mind are like rays of light dissipated; when they are concentrated, they illumine. This is our only means of knowledge... How has all the knowledge in the world been gained but by the concentration of the powers of mind? The world is ready to give up its secrets if we only know how to knock, how to give it the necessary blow. The strength and force of the blow come through concentration. There is no limit to the power of the human mind. The more concentrated it is, the more power is brought to bear on one point; that is the secret.*

చెదిరిన సూర్యకిరణాలను కేంద్రీకరించినప్పుడు అవి తీక్షణంగా ప్రకాశిస్తాయి. అలాగే ఏకాగ్రత వల్ల మనశ్శక్తులు దీప్తిస్తాయి. జ్ఞానానికి ఇదే సాధనం. లోకంలో  మనకు ఉపయోగకరమైన జ్ఞానమంతా చిత్తైకాగ్రత వలన కలిగిన జ్ఞానమే. ఎలా తట్టాలో ఎలా ఛేదించాలో మనకు తెలియగానే ఈ ప్రపంచం (ప్రకృతి) తన రహస్యాలను బయల్పరచడానికి సిద్ధంగా ఉంది. ఈ ఛేదింటానికి కావలసిన శక్తి ఏకాగ్రత వల్ల సమకూరుతుంది. మనస్సు ఎంతగా ఏకాగ్రమౌతుందో అంతగా ఒక విషయంపై కేంద్రీకృతమౌతుంది. ఇదే రహస్యం.



*Never think there is anything impossible for the soul. It is the greatest heresy to think so. If there is sin, this is the only sin - to say that you are weak.*



ఆత్మకు అసాధ్యమైనది ఏదైనా కలదని ఎన్నడూ తలచకండి. అలా భావించడం గొప్ప అపచారమే. పాపం అనేది ఏదైనా ఉంటే అది - మీరు దుర్బలురని లేదా ఇతరులను బలహీనులని పలకడమే!

*Know that every thought and word that weakens you in the world is the only evil that exists. Whatever makes man weak and fear is the only evil that should be shunned.*

మిమ్మల్ని బలహీనపరిచే ప్రతి ఆలోచన, పలుకు మాత్రమే ఈ లోకంలో ఉన్న కీడని గ్రహించండి. మనిషిని బలహీనపరిచే, మనిషికి భయాన్ని కలిగించే దానిని మాత్రమే చెడుగా భావించి తిరస్కరించాలి.



The greatest sin is
to think yourself weak.



మిమ్మల్ని మీరు బలహీనులుగా
భావించుకోవడమే గొప్పపాపం.

*I beg you to understand this one fact - no good comes out of the man who day and night thinks he is nobody. If a man day and night thinks he is miserable low and nothing, nothing he becomes... That is the great fact which you ought to remember.*

మీరు దీనిని చక్కగా గ్రహించాలని నా ప్రార్థన - తాను వ్యర్థుడనని మననం చేసే వ్యక్తి వల్ల ఎటువంటి శుభమూ చేకూరదు. మనిషి రేయింబవళ్ళు తాను దుఃఖితుడనని, అధముడనని, పనికిమాలిన వాడినని భావించడం వల్ల, అతడు పనికిమాలిన వాడే అయిపోతాడు. ఈ మహాసత్యాన్ని ఎల్లప్పుడూ జ్ఞాపకం ఉంచుకోండి.



*Being reminded of weakness does not help much; give strength, and strength does not come by thinking of weakness all the time. The remedy for weakness is not brooding over weakness, but thinking of strength.*



బలహీనతను గుర్తుచేసుకోవడం వల్ల ఏమీ ప్రయోజనం లేదు, బలాన్ని పెంపొందించండి. ఎంతసేపూ బలహీనత గురించి ఆలోచించడం వల్ల బలం రాదు. బలహీనతకు పరిష్కారం బలహీనత గురించి చింతించడం కాదు, బలం గురించి ఆలోచించడమే.

*If you tell a man, "You are low, you are vile," in season and out of season, then he is bound to believe in course of time that he is really such.*

ఒక వ్యక్తితో "నువ్వు అధముడవు, దుష్టుడవు" అని పదే పదే చెప్పడం వలన క్రమంగా ఆ వ్యక్తి తాను నిజంగా అలాంటివాడే అని నమ్ముతాడు.



To call another a sinner is
the worst thing you can do.



ఇంకొకరిని 'పాపి' అని అనడమే
మీరు చేసే పెద్ద తప్పు.

*Everybody is hypnotised already.*
*The work of attaining freedom, of realising one's real nature, consists in de-hypnotisation.*

ప్రతి ఒక్కరూ సమ్మోహితులై ఉన్నారు.
దాని నుండి బయటపడాలంటే తమ నిజస్వరూపం గురించి తెలుసుకొని ముక్తులుకావడమే.



*Come up, O lions, and shake off the delusion that you are sheep; you are souls immortal, spirits free, blest and eternal; you are not matter, you are not bodies; matter is your servant, not you the servant of matter.*



సింహాల్లారా రండి! మీరు గొఱ్ఱెలనే భ్రమ నుంచి బయటపడండి. మీరు అమరులు, పవిత్రులు, శాశ్వతులు. మీరు ప్రకృతి కాదు, శరీరం కాదు. ప్రకృతే మీకు బానిస, మీరు ప్రకృతికి బానిసలు కాదు.

"Children of immortal bliss" - what a sweet, what a hopeful name! Allow me to call you, brethren, by that sweet name - heirs of immortal bliss... You are the children of God, the sharers of immortal bliss, holy and perfect beings. You divinities on earth - sinners! It is a sin to call a man so; it is a standing libel on human nature.

'అమృతపుత్రులు'... ఎంత మధురమైన ఆశాజనకమైన పేరు! సోదరులారా! మిమ్మల్ని ఈ మధురమైన అమృతపుత్రులు పేరుతో పిలువనివ్వండి. మీరు భగవంతుని పుత్రులు, దివ్యానందానికి వారసులు, పవిత్రులు, పరిపూర్ణులు. భువిపై నడయాడే దేవతలు. మీరు పాపులా! ఒక మనిషిని అలా పిలవడమే పాపం; కళంకరహిత మనిషి నిజస్వభావానికి కళంకం ఆపాదించడమే.



*Arise, awake! Awake from this hypnotism of weakness. None is really weak; the soul is infinite, omnipotent and omniscient. Stand up, assert yourself, proclaim the God within you, do not deny Him! Too much of inactivity, too much of weakness, too much of hypnotism has been and is upon our race... De-hypnotise yourselves.*



లేవండి, మేల్కొనండి! బలహీనత అనే ఇంద్రజాల మత్తు నుండి మేల్కొనండి. ఎవరూ నిజంగా బలహీనులు కారు. ఆత్మ అనంతం, సర్వజ్ఞాతమూనూ! లేచి నిలబడి మీ ఉనికిని చాటండి, లోపలున్న దైవాన్ని ప్రకటించండి, ఆయన్ను తిరస్కరించకండి! తీవ్రమైన స్తబ్ధత, బలహీనత, దీర్ఘకాలపు ఇంద్రజాలం మన జాతిని ఎప్పటినుంచో ఆవహించింది. ప్రస్తుతం కూడా ఆవహించి ఉంది. ఇంద్రజాల ప్రభావం నుండి బయటపడండి.

*Studying the external alone, man begins to feel himself to be nothing. Therefore it is not the study of external nature that makes one strong. But there is the internal nature of man - a million times more powerful than any volcanic eruption or any law of nature - which conquers nature, triumphs over all its laws. And that alone teaches man what he is.*

కేవలం బాహ్యప్రపంచాన్ని అధ్యయనం చేస్తూపోతే క్రమంగా మనిషి తనను తాను ఎందుకూ కొరగానివానిగా భావించనారంభిస్తాడు. కాబట్టి బాహ్యప్రకృతి అధ్యయనం మనల్ని శక్తిమంతంగా చేయదు. మనిషి అంతఃస్వరూపం ఏ ప్రకృతి ధర్మం కన్నా, అగ్ని పర్వత విస్ఫోటనం కన్నా లక్షల రెట్లు శక్తిమంతమైనది. ఈ అంతఃశక్తి బాహ్యప్రకృతి ధర్మాలన్నింటినీ అధిగమిస్తుంది. ఈ అంతఃప్రవృత్తే మనిషికి తాను ఏమిటో తెలుపుతుంది.



Do you know how much energy, how many powers, how many forces are still lurking behind that frame of yours? What scientist has known all that is in man? Millions of years have passed since man first came here, and yet but one infinitesimal part of his powers has been manifested. Therefore, you must not say that you are weak. How do you know what possibilities lie behind that degradation on the surface? You know but little of that which is within you. For behind you is the ocean of infinite power and blessedness.



మీ శరీరంలో ఎన్ని శక్తులు, ఎన్ని సమర్థతలు, ఎన్ని మహిమలు దాగున్నాయో మీకు తెలుసా? మనిషిలో ఉండే సర్వాన్ని తెలుసుకున్న శాస్త్రవేత్త ఎవరున్నారు? మనిషి ఈ లోకంలో అవతరించి కోట్ల సంవత్సరాలు గడిచాయి, అయినా మనిషికి తనలోని శక్తులలో అణు మాత్రమే ఇప్పటికి వ్యక్తీకరణకు వచ్చింది. కాబట్టి 'నేను దుర్బలుడును' అని పలుకరాదు. పైపైన కనిపించే హీనత క్రింద మరుగుపడి ఎంత మహత్తు ఉందో మీకెలా తెలుస్తుంది. మీ లోపల దాగివున్న మహత్తును గూర్చి మీకు తెలిసింది అత్యల్పం. మీలో అనంత సింధువును పోలిన శక్తి మహిమ దాగి ఉంది.

Say not man is a sinner.
Tell him that he is a God.

మనిషి పాపాత్ముడని అనవద్దు.
అతడొక దైవమని తెలియజేయండి.



*Silly fools tell you that you are sinners, and you sit down in a corner and weep. It is foolishness, wickedness, down-right rascality to say that you are sinners! You are all God.*



అవివేకులైన మూర్ఖులు మిమ్మల్ని 'పాపులు' అని అంటే, మీరు ఒకమూల కూర్చొని శోకించడం ప్రారంభిస్తారు. మిమ్మల్ని పాపులనడం మూర్ఖత్వం, దౌష్ట్యం, ధూర్తత్వం. మీరందరూ దైవమే.

*The greatest error, says the Vedanta, is to say that you are weak, that you are a sinner, a miserable creature,and that you have no power and you cannot do this and that. Every time you think in that way, you, as it were, rivet one more link in the chain that binds you down, you add one more layer of hypnotism into your own soul. Therefore, whosoever thinks he is weak is wrong, whosoever thinks he is impure is wrong, and is throwing a bad thought into the world.*

"నేను బలహీనుడనని, పాపినని, దుఃఖితుడననీ, శక్తిహీనుడననీ, 'అది చేయలేను-ఇది చేయలేను' అని అనడమే పెద్ద పొరపాటు అని వేదాంతం అంటుంది. ఈ విధంగా మీరు భావించిన ప్రతిసారీ మిమ్మల్ని నిర్బంధిస్తున్న కర్మ బంధపు గొలుసుకు మీరు ఇంకొక కొక్కాన్ని తగిలిస్తున్నట్లే. మీరొక ఇంద్రజాలపు పొరతో ఆత్మను కప్పివేస్తున్నట్లే. కాబట్టి తాను బలహీనుడననీ, అపవిత్రుడననీ ఎవరైనా భావిస్తే అది తప్పు. ఆ విధంగా చేస్తే వారు ప్రపంచంలోకి ఒక చెడు ఆలోచనను పంపిస్తున్నట్లే!



*Religion gives you nothing new; it only takes off obstacles and lets you see your Self.*

ఆధ్యాత్మిక ధర్మము క్రొత్తగా ఏమీ ఇవ్వదు. అది కేవలం అంతరాయాలను తొలగించి, స్వస్వరూపాన్ని వీక్షింపజేస్తుంది.



*You must remember that humanity travels not from error to truth, but from truth to truth; it may be from lower truth to higher truth, but never from error to truth.*



మానవకోటి అసత్యం నుండి సత్యానికి కాక, సత్యం నుండి సత్యానికి పయనిస్తున్నదన్న సంగతి మనం గుర్తించాలి. అది వ్యావహారిక సత్యం నుండి పారమార్థిక సత్యం వైపుకు కావచ్చు. కాని అసత్యం నుండి సత్యం వైపుకు మాత్రము కాదు.

*The tapas and the other hard Yogas that were practised in other Yugas do not work now. What is needed in this Yuga is giving, helping others. What is meant by 'dana' ? The highest of gifts is the giving of spiritual knowledge, the next is giving secular knowledge and the next a saving of life, the last is giving food and drink. He who gives spiritual knowledge saves the soul from many and many a birth.*

ఖి గతా యుగాలలో ఆచరించిన తపస్సులు, కష్టభూయిష్టాలైన యోగాలు నేడు ఉపయోగపడవు. ఈ యుగంలో ఆవశ్యకమైంది దానం, ఇతరులకు సహాయపడటం. దానం అంటే ఏమిటి? పారమార్థిక జ్ఞానాన్ని అందించడం అత్యుత్తమ దానం, దాని తర్వాత వ్యావహారిక జ్ఞాన దానం. ఆ పిమ్మట ప్రాణరక్షణ, చివరిది అన్నపానీయాలను అందించడం. ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ఇచ్చేవారు జీవుణ్ణి జననమరణ చక్రపరంపర నుండి రక్షించ గలరు.



Neither seek nor avoid; take what comes.
This is freedom, to be affected by nothing.
Do not merely endure; be unattached.



కోరనూవద్దు, త్రోసిపుచ్చనూ వద్దు. లభించిన దానిని స్వీకరించు.
దేనివల్లా బాధించబడకుండా ఉండడమే స్వాతంత్ర్యం.
సహించి ఉన్నంత మాత్రాన చాలదు, అసంగుడవు కావాలి.

*If a man with an ideal makes a thousand mistakes, I am sure that the man without an ideal makes fifty thousand. Therefore it is better to have an ideal.*

ఆదర్శం గల వ్యక్తి వెయ్యి తప్పులు చేస్తే, ఏ ఆదర్శం లేని వ్యక్తి ఏభై వేల తప్పులు చేస్తాడనడం నిస్సంశయం. కాబట్టి ఒక ఆదర్శం కలిగివుండడం మంచిది.



*The old religions said that he was an atheist who did not believe in God. The new religion says that he is the atheist who does not believe in himself.*



భగవంతునిపై నమ్మకం లేనివాడు నాస్తికుడని పూర్వపు మతాలు బోధించాయి. తనపై తనకు నమ్మకము లేని వాడు నాస్తికుడని ఆధునిక మతం బోధిస్తున్నది.

*India's gift to the world is the spiritual light... Slow and silent, as the gentle dew that falls in the morning, unseen and unheard yet producing a most tremendous result.*

భారతదేశం, ప్రపంచానికి ఇచ్చే కానుక ఆధ్యాత్మిక జ్ఞానమే! మన ఆధ్యాత్మిక భావాలు కంటికి కనపడక, చెవికి వినపడక, తెల్లవారు జామున మెల్లమెల్లగా నేలకు జాలువారు మంచు బిందువుల వలె ప్రపంచమంతా వ్యాప్తి చెందుతున్నాయి.



*Beware of everything that is untrue:*
*stick to truth and we shall succeed,*
*may be slowly, but surely.*



అసత్యమైన దానికి దూరంగా ఉండు.
సత్యాన్నే అంటిపెట్టుకొని ఉంటే విజయం సాధించగలం.
ఆలస్యమైనప్పటికీ విజయం సాధించే తీరతాం.

*The road to good is the roughest and steepest in the universe. It is a wonder that so many succeed, no wonder that so many fall. Character has to be established through a thousand stumbles.*

ఈ విశ్వంలో శ్రేయస్సును చేకూర్చే మార్గం ఎంతో నిటారుగా ఉంటూ అత్యంత దుర్గమమైంది. ఇందులో ఎంతోమంది విజయం సాధించడం అద్భుతమైతే, అనేకమంది అపజయం పొందడంలో ఆశ్చర్యం లేదు. ఎన్నో అడ్డంకులను ఎదుర్కొని వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవలసి ఉంది.



*Be of good cheer and believe that we are selected by the Lord to do great things, and we will do them.*



ఘనకార్యాలను సాధించడానికే భగవంతుడు మనల్ని ఎన్నుకొన్నాడని విశ్వసించి, ఉత్సాహంగా ఉండండి. మనం వాటిని సాధించే తీరుతాం.

*Great indeed are the manifestations of muscular power, and marvellous the manifestations of intellect expressing themselves through machines by the appliances of science; yet none of these is more potent than the influence which spirit exerts upon the world.*

కండబలం నిజానికి గొప్పదే, కండబల వ్యక్తీకరణలు గొప్పవే. యంత్రాలు, విజ్ఞాన శాస్త్ర పరికరాల ద్వారా అభివ్యక్తీకరింపబడిన బుద్ధిశక్తి కూడా గొప్పదే. కాని ప్రపంచంపై ఆత్మశక్తి చూపే ప్రభావం కన్నా ఇవేవీ శక్తిమంతమైనవి కావు.



*Let us be true. Nine-tenths of our life's energy is spent in trying to make people think of us that which we are not. That energy would be more rightly spent in becoming that which we would like to be.*



సత్యనిష్టలుగా ఉందాం! మన జీవితంలో పదిలో తొమ్మిదోవంతు శక్తి మనం ఏదికామో అదిగా మనల్ని జనులు భావించాలని చేసే ప్రయత్నంలో ఖర్చుపెడతాం. ఆ శక్తి మనం ఎలా ఉండాలనుకుంటున్నామో అలా తయారవడానికి (చేసే ప్రయత్నంపై) వినియోగిస్తే సబబుగా ఉంటుంది.

*Pray day and night, "O Thou Mother of the Universe, vouchsafe manliness unto me! O Thou, Mother of Strength, take away my weakness, take away my unmanliness, and make me a Man!"*

అహర్నిశలు ఇలా ప్రార్థించు :
ఓ జగజ్జననీ, నాకు ధీరత్వాన్ని ప్రసాదించు!
ఓ శక్తిశాలినీ! నా బలహీనతలను, దౌర్బల్యాన్ని తొలగించి
నన్ను ధీరమానవునిగా చేయి!



*The older I grow, the more everything seems to me to lie in manliness. This is my new gospel.*



నాకు పరిణతి కలుగుతున్న కొద్దీ సర్వమూ ధీరత్వంలోనే (పురుషకారం) ఉన్నదనిపిస్తుంది. ఇది నా నూతన సందేశము.

*Religion is manifestation of divinity already with in you.*

మీలో ఉన్న దివ్యత్వాన్ని
అభివ్యక్తీకరించడమే మతం.



*Let him who has courage in his mind and love in his heart come with me. I want none else.*

మనస్సులో ధైర్యం, హృదయంలో ప్రేమ ఉన్నవానిని నన్ను అనుసరించనివ్వండి. నాకు ఇంకెవరూ వద్దు.



*Truth, purity and unselfishness - wherever these are present, there is no power below or above the sun to crush the possessor thereof. Equipped with these, one individual is able to face the whole universe in opposition.*



సత్యం, పవిత్రత, నిస్వార్థత - ఈ మూడూ ఎక్కడ ఉంటాయో... అక్కడ సూర్యునికి పైనగాని క్రిందగాని ఉన్న ఏ శక్తులూ పని చేయజాలవు. ఈ లక్షణాలు ఉన్న వ్యక్తి ప్రపంచమంతా వ్యతిరేకంగా ఉన్నప్పటికీ పోరాడగలడు.

Purity, patience, and perseverance
are the three essentials to success,
and above all - love.

పవిత్రత, సహనం, పట్టుదల -
విజయాన్ని సాధించడానికి కావలసిన మూడు ఆవశ్యకాలు.
వీటన్నిటికీ మించి కావలిసింది - ప్రేమ.



*Know that talking ill of others in private is a sin. You must wholly avoid it. Many things may occur to the mind, but it gradually makes a mountain of a molehill if you try to express them. Everything is ended if you forgive and forget.*



పరోక్షంగా ఇతరులను గూర్చి చెడుగా మాట్లాడడం పాపం, దీనిని మీరు పూర్తిగా విసర్జించాలి. మనస్సులో ఏమేమో తోచవచ్చు, కాని వాటిని బయట పెట్టడానికి ప్రయత్నిస్తే క్రమక్రమంగా అవి గోరంతలు కొండంతలుగా తయారవుతాయి. క్షమించి మరచిపోతే అంతా సమసిపోతాయి.

Whatever others think or do, lower not your standard of purity, morality and love for God.

ఇతరులు ఏమి తలచినా, ఏమి చేసినా సరే నీవు మాత్రం నీ పావనత్వాన్ని, నైతిక వర్తనను, భగవద్భక్తి యొక్క స్థాయిని దిగజార్చకు.



*So long as you have love for God and Guru, and faith in truth, nothing can hurt you, my son.*



నాయనా! భగవద్భక్తి, గురుభక్తి, సత్యమునందు విశ్వాసం ఉన్నంత వరకు ఏదీ నీకు హాని కలిగించలేదు.

*If you are pure, if you are strong, you, one man are equal to the whole world.*

నీవు పవిత్రుడవు, బలసంపన్నుడవు అయితే
నీవు ఒక్కడవు అఖిల జగత్తుకు సమానుడవు అవుతావు.



The man who is pure, and who dares, does great things.



పవిత్రుడూ, సాహసోపేతుడూ అయిన వ్యక్తే ఘనకార్యాలను సాధించగలడు.

*Neither money pays, nor name, nor fame, nor learning; it is character that can cleave through adamantine walls of difficulties. Bear this in mind.*

ధనం కాదు, కీర్తి ప్రతిష్ఠలు కాదు, విద్వత్తు(పాండిత్యము) కాదు, సౌశీల్యమొక్కటే కష్టాలనే దుర్భేద్యమైన అడ్డుగోడలను చీల్చుకొని పోగలిగినది. దీనిని జ్ఞప్తిలో ఉంచుకోండి.



*Well, my boy, this is the school of misery, which is also the school for great souls and prophets for the cultivation of sympathy, of patience, and, above all, of an indomitable iron will which quakes not even if the universe be pulverised at our feet.*



నాయనా! ఇది (ఈ ప్రపంచం) దుఃఖపు పాఠశాల. మహాత్ములకు, ప్రవక్తలకు సానుభూతిని, సహనాన్ని పెంపొందించుకోవటానికీ, అన్నింటికీ మించి మన పాదాల వద్ద నుంచే ఈ విశ్వమే నుగ్గునుగ్గు అయిపోయినా చలించని అప్రతిహతమైన వజ్రసంకల్పాన్ని పెంపొందించుకోవటానికి కూడా ఇది పాఠశాల.

Be a man first, my friend, and you will see how all those things (money, name, fame) and the rest will follow of themselves after you. Give up that hateful malice, that dog-like bickering and barking at one another, and take your stand on good purpose, right means, righteous courage, and be brave. When you are born a man, leave some indelible mark behind you.

ఓ నా మిత్రమా! ముందు మనిషి వవు. అప్పడు అవన్నీ (ధనం, పేరు ప్రతిష్ఠలు) మిగతావి కూడా వాటంతట అవే నిన్ను అనుసరించి వస్తాయి. అసూయా ద్వేషాలను, శునకాలలాగా పోట్లాడుకోవడాన్ని, ఒకరిపై ఒకరు అరుచుకోవడాన్ని త్యజించండి. సదుద్దేశాలను, సన్మార్గాలను ఆశ్రయించి ధైర్య, స్థైర్యాలతో ఉండండి. మనిషిగా పుట్టినందుకు ఒక చెరగని ముద్రను వేసి వెళ్లండి.



*What the world wants is character. The world is in need of those whose life is one burning love, selfless. That love will make every word tell like thunderbolt... Bold words and bolder deeds are what we want. Awake, awake, great ones!*



లోకానికి కావలసింది సత్ప్రవర్తన (సౌశీల్యం). ఎవరి జీవితం ఉజ్జ్వల ప్రేమయుతమై, స్వార్థరహితమై ఉంటుందో అలాంటి వారే లోకానికి కావలసి ఉన్నారు. అటువంటి ప్రేమతో కూడిన ప్రతిమాటా పిడుగువలె తాకుతుంది. ధీరవాక్కులు, ధీరతరమైన చేతలు మనకు కావలసి ఉన్నవి. ఓ మహనీయులారా! లేవండి, మేల్కొనండి!

*Brahmacharya should be like a burning fire within the veins (in the student's life).*

విద్యార్థి దశలో బ్రహ్మచర్యం
నరాల్లో అగ్నిలా ప్రజ్వలించాలి.



Follow me, if you will, by being intensely sincere, perfectly unselfish, and, above all, by being perfectly pure. My blessings go with you.



మీకు ఇష్టమైతే అత్యంత నిష్కపటంతో, నిస్వార్థంతో, అన్నింటి కంటే ముఖ్యంగా పరిపూర్ణమైన పావనత్వంతో నన్ను అనుసరించండి. నా ఆశీస్సులు మీ వెన్నంటి ఉంటాయి.

Holiness is the greatest power.
Everything else quails before it.

పవిత్రతే గొప్పశక్తి. దాని ముందు
మిగిలినదంతా బిత్తర పోతుంది.



*Out of purity and silence comes the word of power.*



పవిత్రత, నిశ్శబ్దతల నుండే

అమోఘవాక్కు వెలువడుతుంది.

*What brutality is there which purity and chastity cannot conquer?*

బ్రహ్మచర్యం, పవిత్రతలతో జయించలేని క్రూరత్వం ఏమి ఉంది?



Be pure first and you will have power. The chaste brain has tremendous energy and gigantic will-power. Continence gives wonderful control over mankind. The spiritual leaders of men have been very continent and that is what gave them power.



పవిత్రులు కండి! శక్తి వస్తుంది. పవిత్ర మనస్సులో అనంతశక్తి, గొప్ప సంకల్ప బలం ఉంటాయి. బ్రహ్మచర్యం మానవాళిపై అద్భుతమైన నియంత్రణను ప్రసాదిస్తుంది. ఆధ్యాత్మిక గురువులు బ్రహ్మచర్యాన్ని పాలిస్తూ రావడం వల్లే వారికి శక్తి సంక్రమించింది.

*Is there a greater strength than that of Brahmacharya - purity, my boy?*

నాయనా! బ్రహ్మచర్యం, పవిత్రతల కన్నా ఉన్నతమైన బలం ఏముంది?



There is no allegiance possible where there is no character in the leader, and perfect purity ensures the most lasting allegiance and confidence.



నాయకుడిలో సౌశీల్యం (మంచి నడవడి, సత్ప్రవర్తన) లోపిస్తే విధేయతను పొందలేడు. సంపూర్ణ పవిత్రత కలకాలం నిలిచే విధేయతను, నమ్మికను పెంపొదిస్తుంది (నాయకుడిపై).

Disciple: "But who can aspire to be like you, Swamiji? Who can come by that oratorical power of expounding philosophy which you have?"

Swamiji : "You don't know! That power may come to all. That power comes to him who observes unbroken Brahmacharya for a period of twelve years, with the sole object of realising God. I have practised that kind of Brahmacharya myself, and so a screen has been removed, as it were, from my brain. For that reason, I need not anymore think over or prepare myself for any lectures on such subtle subject as philosophy.

శిష్యుడు : "మీలాగా ఉండగలమని ఎవరు ఆశించగలరు స్వామీజీ? మీకున్న వాగ్ధాటితో తత్త్వ శాస్త్రాన్ని ప్రవచించటానికి ఎవరు రాగలరు?

స్వామీజీ : "నీకు తెలియదు! ఆ శక్తి అందరికీ రావచ్చు. భగవంతుణ్ణి చేరుకోవటమే ఏకైక లక్ష్యంగా పన్నెండు సంవత్సరాల పాటు బ్రహ్మచర్యాన్ని అవలంబించిన వారికి ఆ శక్తి కలుగుతుంది. అలాంటి బ్రహ్మచర్యాన్ని నేను అనుష్ఠించాను. నా మనస్సులోంచి ఒక తెర తొలగిపోయినట్లైంది. ఆ కారణంగా నేను తత్త్వ శాస్త్రం వంటి సూక్ష్మ విషయాలపై ఉపన్యసించటానికి కూడా ఆలోచించడం లేదా ముందుగా తయారవనవసరం లేదు.



A chaste brain has tremendous energy and gigantic will power. Without brahmacharya, there can be no spiritual strength. Brahmacharya gives wonderful control over mankind.



బ్రహ్మచర్యం వలన అద్భుతమైన సామర్థ్యం, బ్రహ్మాండమైన సంకల్పశక్తీ కలుగుతాయి. బ్రహ్మచర్యం లేనిదే ఎట్టి ఆధ్యాత్మిక శక్తీ కలుగదు. ఇంద్రియ నిగ్రహం వల్ల మానవకోటిపై అద్భుతమైన వశీకరణ శక్తి లభిస్తుంది.

The ideal of faith in ourselves is of the greatest help to us. Throughout the history of mankind, if any motive power has been more potent than another in the lives of all great men and women, it is that of faith in themselves.

మనపై మనకు విశ్వాసాన్ని చేకూర్చే ఆదర్శం మనకు అత్యంత ప్రయోజనకరం. మానవ చరిత్ర అంతటినీ పరిశీలిస్తే, ఘనకార్యాలను సాధించిన స్త్రీ పురుషుల జీవితాలలో అన్నింటికంటే అధిక సామర్థ్యాన్ని ఇచ్చిన మూలశక్తి వారి ఆత్మవిశ్వాసమే అని తెలుస్తుంది.



Superstition is a great enemy of man.

మనిషికి మూఢవిశ్వాసం ఒక ప్రబల శత్రువు.



*I would rather see everyone of you rank atheists than superstitious fools, for the atheist is alive and you can make something out of him. But if superstition enters, the brain is gone, the brain is softening, degradation has seized upon the life.*



మీరంతా నాస్తికులుగా మారిపోయినా ఫరవాలేదుగాని, మూఢాచారాలతో మూర్ఖులై పోవడం మాత్రము తగదు. నాస్తికుడు అయినప్పటికీ వాని వల్ల కొంతైనా ప్రయోజనం నెరవేరగలదు. కాని మూఢాచారం ప్రవేశిస్తే మెదడు ధ్వంసమైపోయినట్లే! బలహీనమైనట్లే! జీవితము భ్రష్టమైపోయినట్లే!

*You had better die as an unbeliever than be played upon by cheats and jugglers. The power of reasoning was given you for use. Show then that you have used it properly.*

మోసగాళ్ళు, వంచకుల ప్రభావంలో పడటంకన్నా మీరు నాస్తికులై మరణించడం మేలు. ఉపయోగించడానికి మీకు విచక్షణా జ్ఞానం ఇవ్వబడింది. ఆ జ్ఞానాన్ని సరిగ్గా ఉపయోగించినట్లు నిరూపించండి.





I am sure God will pardon a man who will use his reason and cannot believe, rather than a man who believes blindly instead of using the faculties He has given him.



తనకున్న ప్రజ్ఞను ఉపయోగించకుండా ప్రతిదానినీ గ్రుడ్డిగా నమ్మేవాడికన్నా, తన విచక్షణా జ్ఞానాన్ని ఉపయోగించి నమ్మకం లేని వాడిగా ఉన్న మనిషిని భగవంతుడు క్షమిస్తాడు.

*One must have a strong brain, a clear mind free of nonsensical ideas; he must pierce through the mass of superstitions encrusting his mind to the pure truth that is in his inmost Self. Then he will know that all perfections, all power are already within himself, that these have not to be given to him by others.*

మెదడు బలమైందిగా ఉండాలి. అసంగతాలైన భావాలేవీ లేకుండా స్పష్టంగా ఆలోచించగల మనస్సు కావాలి. తన మనస్సుపై గట్టిపూతగా ఏర్పడిన మూఢనమ్మకాలను సహితం లెక్కించక, అంతరంగంలో ఉన్న సత్యాన్ని దర్శించగలగాలి. అప్పుడు సమస్త పరిపూర్ణత్వం, సకల శక్తులు తనయందే కలవని, ఇవి తనకు ఇతరులు ఈయవలసిన అవసరం లేదని అతడు తెలిసికొంటాడు.



*Believe not because an old manuscript has been produced, because it has been handed down to you from your forefathers, because your friends want you to - but think for youself; search truth for yourself; realize it yourself.... Soft-brained men, weak-minded, chicken-hearted cannot find the truth.*



పురాతన గ్రంథాలలో ఉందనిగాని, మీ తాతముత్తాతలనుండి సంక్రమించిందనిగాని, మీ స్నేహితులు కోరుతున్నారని గాని మీరు దేనిని నమ్మవద్దు. మీ అంతట మీరే ఆలోచించుకొని, సత్యాన్ని స్వయంగా అన్వేషించండి. అనుభూతిని కావించుకోండి.... మందమతులు, బలహీన మనస్కులు, దుర్బల హృదయులు (పిరికి వారు) సత్యాన్ని దర్శింపజాలరు.

Brave, bold men, these are what we want. What we want is vigour in the blood, strength in the nerves, iron muscles and nerves of steel, not softening namby-pamby ideas... Avoid all mystery. There is no mystery in religion.

ధైర్యవంతులు, సాహసవంతులు మనకు ఇప్పుడు అవసరం. రక్తంలో సత్తువ, నరాల్లో బలం కలిగి, ఇనుప కండరాలు, ఉక్కు నరాలు కావాలి గాని నిలకడలేని ఊరికే జారిపోయే పిచ్చి ఊహలెందుకు? రహస్యం వద్దు. మతంలో రహస్యానికి తావులేదు.





In religion, as in all other matters, discard everything that weakens you, have nothing to do with it. Mystery-mongering weakens the human brain.



మతంలోనూ, మిగతా విషయాలలాగా, మిమ్మల్ని బలహీనులనుగా చేసే సమస్త విషయాలను పరిత్యజించండి. వాటిజోలికి వెళ్ళకండి (వాటితో మీకు సంబంధం లేదు). రహస్య సాధనతో కూడుకున్న క్షుద్ర విద్యల వల్ల మానవ మేధ బలహీనమవుతుంది.

*Mystery-mongering and superstition are always signs of weakness. These are always signs of degradation and of death. Therefore beware of them; be strong, and stand on your own feet*

రహస్య ప్రచారం, మూఢ విశ్వాసం దుర్బలతకు చిహ్నాలు! పతనానికీ, మరణానికీ చిహ్నాలు! కాబట్టి వాటి విషయంలో జాగ్రత్త వహించి ధీరులై మీ కాళ్లమీద మీరు నిలబడండి.





*Anything that makes you weak physically, intellectually and spiritually, reject as poison; there is no life in it, it cannot be true. These mysticisms, in spite of some grains of truth in them, are generally weakening.*



భౌతికంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా మిమ్మల్ని బలహీనపరిచేది ఏదైనా సరే, దాన్ని విషప్రాయంగా తిరస్కరించండి! దానిలో జీవశక్తి లేదు... అది సత్యము కాజాలదు. రహస్యోపదేశాలలో కొంత సత్యం ఉన్నప్పటికీ, అవి సాధారణంగా మానవులను నిర్వీర్యులను చేస్తాయి.

*Anything that is secret and mysterious in the systems of yoga should be at once rejected. The best guide in life is strength.*

ఈ యోగపద్ధతులలో ఏది గుప్తంగా, రహస్యంగా ఉంటుందో దానిని వెంటనే పరిత్యజించాలి. బలమే జీవనయాత్రలో సరైన త్రోవ చూపేది.



*I must frankly state that in my life-long experience, I have always found "Occultism" injurious and weakening to humanity. What we want is strength. We Indians, more than any other race, want strong and vigorous thought. We have enough of the superfine in all concerns. For centuries we have been stuffed with the mysterious; the result is that our intellectual and spiritual digestion is almost hopelessly impaired, and the race has been dragged down to the depths of hopeless imbecility.*



నాకు కలిగిన జీవితానుభవము వల్ల 'రహస్య సిద్ధులు' ఎల్లప్పుడు హానికరాలని అవి మానవజాతిని బలహీనపరుస్తాయని నిష్కపటముగా చెప్పక తప్పదు. మనకు కావలసింది బలం. ఏ ఇతరజాతి కన్నా, భారతీయులమైన మనకు కావలసింది బలమైన, శక్తిమంతమైన ఆలోచన. అన్ని విషయాలలోను కావలసినంత ప్రావీణ్యత మనకు ఉంది. శతాబ్దాలుగా మనం రహస్యసిద్ధులతో నింపబడ్డాం. దానివల్ల మనకు మానసిక, పారమార్థిక భావాలను జీర్ణించుకునే శక్తి పూర్తిగా క్షీణించింది..... జాతి దౌర్బల్యపు అగాధంలోకి లాగబడింది.

*Every system, which weakens the mind, makes one superstitious, makes one mope, makes one desire all sorts of wild impossibilities, mysteries, and superstitions, I do not like, because its effect is dangerous. Such systems never bring any good; such things create morbidity in the mind, make it weak, so weak that in course of time it will be almost impossible to receive truth or live up to it. Strength, therefore, is the one thing needful.*

మనస్సును బలహీనపరిచే ప్రతి పద్ధతి మనిషిని మూఢాచార పరాయణుడిగా, దుఃఖితుడిగా, తీవ్ర అసంభవాలను కోరుకునేవాడిగా చేస్తుంది. మూఢ విశ్వాసాలు, మార్మికాలు విపత్తును కలుగజేస్తాయి కాబట్టి నాకు నచ్చవు. ఆ పద్ధతులు ఎప్పుడూ మంచిని చేకూర్చవు, అవి మనస్సును వ్యాధిగ్రస్తం చేస్తాయి, బలహీన పరుస్తాయి. అవి ఎంత బలహీన పరుస్తాయంటే చివరకు సత్యాన్ని గ్రహించటంగానీ, అనుగుణంగా జీవించటంగానీ అసాధ్యంగా పరిణమిస్తుంది. కాబట్టి బలమే కావలసి ఉన్నది.





*There must be freshness and vigour of thought behind to make a virile race. More than enough to strengthen the whole world exists in the Upanishads... But it requires to be applied.*



వీర్యవంతమైన జాతిని తయారుచేయడానికి స్వచ్ఛత, ఆలోచనలో శక్తి ఆధారంగా ఉండాలి. యావత్ప్రపంచాన్ని శక్తిమంతం చేయడానికి కావలసిన దానికన్నా అధిక శక్తి ఉపనిషత్తులలో ఉంది. కాని, అది ఆచరణలోకి తీసుకు రావాలి.

*Religion is the manifestation of the natural strength that is in man... It is always a manifestation of strength.*

మానవునిలో సహజ సిద్ధంగానే దాగివున్న శక్తిని వ్యక్తం చేసేదే మతం... ఎప్పుడూ శక్తి అభివ్యక్తీకరణమే మతం.



*I love my nation. I cannot see you degraded, weakened any more than you are now. Therefore I am bound for your sake and for truth's to cry, "Hold!" and to raise my voice against this degradation of my race. Give up these weakening mysticism and be strong... The truths of the Upanishads are before you. Take them up, live up to them, and the salvation of India will be at hand.*



నేను నా దేశాన్ని ప్రేమిస్తాను. మీరు ఇంతకంటే పతనమవటం నేను చూడలేను. కాబట్టి మీ కోసం, సత్యం కోసం "ఇక ఆగు" అని నేను కంకణాబద్ధుడనై ఎలుగెత్తి చాటి నా ఈ జాతి పతనానికి వ్యతిరేకంగా గళాన్ని పెంచుతాను. ఈ దుర్భర రహస్యాలను విడిచి బలవంతులు కండి. ఉపనిషత్ సత్యాలు మీముందున్నాయి. వాటిని స్వీకరించండి, ఆచరించి చూపండి. అప్పుడు భారతదేశ విముక్తి మీ చేతులలోనే ఉంది.

Go back to your Upanishads- the shining, the strengthening, the bright philosophy - and part from all mysterious things, all weakening things.

దివ్యమై, శక్తి ప్రదమై, తేజోవంతములై ఉన్న మీ ఉపనిషత్తులను ఆశ్రయించండి. మిమ్మల్ని దుర్బలురను చేసే రహస్య, మార్మికమైన విషయాల నుండి వైదొలగండి.





Despondency is not religion, whatever else it may be. By being pleasant always and smiling, it takes you nearer to God, nearer than any prayer.



నిరాశ, నిస్పృహ అనేవి ఏమైనా కావచ్చు కాని మతం మాత్రం కాదు. ఎల్లప్పడూ చిరునవ్వుతో ఆనందంతో ఉండడం అనేది ప్రార్థన కంటే కూడా మరింత దగ్గరగా భగవంతుని సాన్నిధ్యం పొందడానికి దోహదపడుతుంది.

*Those who are always down-hearted and dispirited in this life can do no work; from life to life they come and go wailing and moaning.*

నిరుత్సాహులై, అధైర్యపడేవారు జీవితంలో ఏ పనినీ సాధించ లేరు. రోదిస్తూ, దుఃఖిస్తూ జనన మరణముల పాలవుతారు.





*Self-deprecation! What is it for? You are the child of the Infinite, the all-powerful Divine Mother. What means disease, or fear to you? Stamp out the negative spirit as if it were a pestilence, and it will conduce to your welfare in everyway.*



ఆత్మనూన్యత! దేని కది? నీవు సర్వశక్తిమంతురాలూ, అనంతమూ అయిన దివ్యజనని బిడ్డవు. నీకు వ్యాధి ఏమిటి? భయం ఏమిటి? వ్యతిరేక భావాన్ని అంటువ్యాధిగా భావించి నిర్మూలించు. అది మీ అభివృద్ధికి అన్ని విధాలా దోహదపడుతుంది.

*Laziness, meanness, and hypocrisy have covered the whole length and breadth of the country. Can an intelligent man look on all this and remain quiet? Does it not bring tears to the eyes?... Therefore I say, first rouse the inherent power of the Atman within you...*

సోమరితనం, నీచత్వం, కపటత్వం ఇవే ఈ దేశాన్ని ఆమూలాగ్రం కప్పివేసినవి. బుద్ధిమంతుడైనవాడు దీన్నంతా చూచి శాంతంగా కూర్చొనగలడా? కాబట్టి మీలో ఉన్న ఆత్మశక్తిని ముందుగా మేల్కొల్పమని నేను చెపుతున్నాను.





*All weakness, all bondage is imagination...*
*Do not weaken... Stand up and be strong!*
*That is all the religion I know.*



సమస్త దౌర్బల్యం, సమస్త బంధం కేవలం మనఃకల్పనయే.
దౌర్బల్యాన్ని విడనాడు. లే! దృఢంగా ఉండు.
నాకు తెలిసిన మతమిదే.

*Infinite strength is religion and God.*

అనంత శక్తే మతం. అదే దైవం.





What we need is strength; who will give us strength? Upanishads are the great mine of strength. Therein lies strength enough to invigorate the whole world; the whole world can be vivified, made strong, energised through them.



మనకు కావలసినది బలం. మనకు బలాన్ని ఎవరిస్తారు? ఉపనిషత్తులు బలానికి అపార నిధులై ఉన్నాయి. ఈ ప్రపంచం అంతటికీ జవసత్వాలను ఇవ్వగల బలం వాటిలో ఉంది. ఉపనిషత్తుల ద్వారా లోకమంతా జీవశక్తిని, బలాన్ని, ఓజస్సును పొందగలుగుతుంది.

*Strength, strength is what the Upanishads speak to me from every page. This is the one great thing to remember, it has been the one great lesson I have been taught in my life. Strength, it says, strength, O man, be not weak. Are there no human weaknesses?- says man. There are, say the Upanishads, but will more weakness heal them? Would you try to wash dirt with dirt? Will sin cure sin? Will weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.*

"బలం", "బలం" అని ప్రతి పుటనుండీ ఉపనిషత్తులు ఉద్బోధిస్తున్నాయి. మనం గుర్తుంచుకోవలసిన గొప్ప విషయాలలో ఇది ఒకటి. జీవితంలో నాకు నేర్పబడ్డ ఒక గొప్ప పాఠం ఇది. "బలము", "బలంగా ఉండు", "ఓ మానవుడా దుర్బలుడవుగా ఉండడం తగదు" అని హెచ్చరిస్తున్నాయి. మనిషిలో లోపాలు ఉండవా? అని శంకించవచ్చు. సరే లోపాలు ఉన్నాయి. మరిన్ని ఎక్కువ లోపాలు వచ్చి ఉన్న లోపాలను సరిదిద్దుతాయా? మురికితో మురికిని కడగాలని ప్రయత్నిస్తామా? పాపంతో పాపాన్ని హరిస్తామా? దౌర్బల్యాన్ని దౌర్బల్యంతో తొలగిస్తామా?" "బలం... ఓ మనుజుడా, బలాన్నే సంపాదించు! లేచి నిలబడు, బలవంతుడవై ఉండు" అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి.



*First step in getting strength is to uphold the Upanishads, and believe - "I am the soul," "Me the sword cannot cut; nor weapons pierce; me the fire cannot burn; me the air cannot dry; I am the Omnipotent, I am the Omniscient." So repeat these blessed saving words and be strong.*



బలాన్ని సంపాదించడానికి మొట్టమొదటి సాధనం ఉపనిషత్తుల సముత్కృష్టతను గుర్తించి, 'నేను ఆత్మను' అని విశ్వసించడమే. "నన్ను ఖడ్గం చేదించలేదు, ఆయుధాలు ఛిద్రం చేయలేవు, నన్ను అగ్ని దహించలేదు, గాలి  శోషింప చేయలేదు. "నేను సర్వశక్తిమంతుణ్ణి, సర్వజ్ఞుణ్ణి" అనే ధన్యవాక్యాలను ఉచ్చరించి బలవంతులు కండి.

You have now to make the character of Mahavira [Hanuman] your ideal... He was a perfect master of his senses and wonderfully sagacious. You have now to build your life on this great ideal of personal service. Through that, all the other ideals will gradually manifest in life. Obedience to the guru without questioning, and strict observance of Brahmacharya - this is the secret of success. As on the one hand Hanuman represents the ideal of service, so on the other he represents leonine courage, striking the whole world with awe.

మహావీరుడే (హనుమాన్) మీకు ఇప్పుడు ఆదర్శపురుషుడు కావాలి. అతడు జితేంద్రియుడు, సూక్ష్మ దృష్టి కలవాడు. అతని సేవాతత్పరతనే ఆదర్శం కావించుకొని మీరిప్పుడు మీ జీవితాన్ని నిర్మించుకోవాలి. దాని వలన మిగిలిన ఆదర్శాలన్నీ జీవితంలో క్రమంగా అభివ్యక్తమవుతాయి. 'కఠోర బ్రహ్మచర్య పాలన', ' గురువుకు విధేయంగా ఉండటం'... ఇదే విజయ రహస్యం. హనుమంతుడు ఒకవైపు సేవాభావానికి ఆదర్శమూర్తి, మరో వైపు లోకాన్ని హాహాకారాలెత్తించే సింహసదృశ బలాన్వితుడు.



*Keep aside for the present the Vrindavan aspect of Shri Krishna, and spread far and wide the worship of Shri Krishna roaring the Gita out, with the voice of a lion... We now mostly need the ideal of a hero with the tremendous spirit of Rajas thrilling through his veins from head to foot... the hero whose armour is renunciation, whose sword is wisdom. We want now the spirit of brave warrior in the battlefield of life, and not of the wooing lover who looks upon life as a pleasure-garden!*



ప్రస్తుతానికి బృందావన కృష్ణుణ్ణి ఆవలపెట్టి, గీతాసింహ గర్జన చేస్తున్న శ్రీకృష్ణుడి ఆరాధనను అన్ని వైపులా వ్యాపింప చేయి. మనకిప్పుడు కావలసింది వీరారాధన; ఆపాదమస్తకము, రజస్సుతో కూడిన రక్త నాళాలతో స్పందిస్తున్న వీరుని ఆరాధన. త్యాగాన్ని కవచంగా ధరించి, జ్ఞానఖడ్గాన్ని దాల్చిన వీరుని ఆరాధన; జీవిత సంగ్రామంలో మనకు ఇప్పుడు కావలసినది ధైర్యసాహసాలతో పోరాడగల వీరుని శక్తిగాని, జీవితాన్ని నందనోద్యానంగా భావించి ప్రేమకలాపాలు సాగించే ప్రేమికుడు కాదు!

This is the only prayer we should have... to tell ourselves, and to tell everybody else that we are divine. And as we go on repeating this, "I am divine, I am divine," strength comes. He who falters at first will get stronger and stronger, and the voice will increase in volume until the truth takes possession of our hearts, and courses through our veins, and permeates our bodies.

మనం దైవస్వరూపులమని మనకు మనం చెప్పుకోవడమూ, ఇతరులకు తెలియజెప్పడమే మనకు కావలసిన ఏకైక ప్రార్థన. 'నేను దైవాన్ని' అని మళ్ళీ మళ్ళీ ఉచ్చరిస్తూంటే శక్తి వస్తుంది. ముందు తడబడిన వ్యక్తి కూడా తరువాత శక్తిని పుంజుకుంటాడు. సత్యం (ఆత్మ చైతన్యం) మన హృదయంలోనికి ప్రవేశించి (జాగృతమై) రక్తనాళాల ద్వారా శరీరమంతటా వ్యాపించే వరకూ మన గళం పెరుగుతూ పోతూ ఉంటుంది.



In Shastras real self-surrender and reliance on God has been indicated as the culmination of human achievement. But... nowadays the way people speak of Daiva or reliance on Divine dispensation is a sign of death, the outcome of great cowardliness...



నిజమైన ఆత్మసమర్పణ, భగవంతునిపై ఆధారపడటం అనేవి పురుషార్థానికి తుదిమెట్టు అని శాస్త్రాలలో సూచించ బడింది. కాని 'భగవదిచ్ఛ', లేక 'దైవేచ్ఛ' అని ఈ రోజులలో జనులు చెప్పే పద్ధతి మృత్యు చిహ్నమై ఉంది. ఇది వట్టి పిరికితనం; సోమరితనం యొక్క ఫలితం.

Can anyone, my friend, have faith or resignation in the Lord, unless he is a hero? Never can hatred and malice vanish from one's heart unless one becomes a hero, and unless one is free from these, how can one become truly civilised? ... Where in this country is that sturdy manliness, that spirit of heroism?

ప్రియ మిత్రమా! ధీరుడవ్వనిదే ఎవరికైనా భగవంతుని యందు శ్రద్ధగాని, సమర్పణ గాని ఏర్పడుతుందా? ధీరుడవయితే గాని ద్వేషం, అసూయ హృదయం నుండి తొలగిపోవు. ఈ దోషాల నుండి విముక్తుడు కాకుండా నిజమైన నాగరకత కలవాడు ఎట్లా అవుతాడు? ఈ దేశంలో అటువంటి స్థిరమైన పురుషత్వం, ధీరత్వం ఎక్కడ ఉన్నాయి?



*The more opposition there is, the better. Does a river acquire velocity unless there is resistance? The newer and better a thing is, the more oppositon it will meet with at the outset. It is opposition which foretells success. Where there is no opposition there is no success either.*

ప్రతిఘటన, వ్యతిరేకత ఎంత ఉంటే అంత మంచిది. ప్రతిఘటన లేనిదే నదికి వేగం వస్తుందా? ఒక విషయం ఎంత క్రొత్తదైతే, ఎంత మంచిదైతే ప్రారంభ దశలో అది అంత వ్యతిరేకతను ఎదుర్కోవలసి వస్తుంది. వ్యతిరేకతే విజయ సూచకం. ప్రతికూలత ఎక్కడైతే ఉండదో అక్కడ విజయం కూడా ఉండదు.



*But it is a tremendous truth that if there be real worth in you, the more are circumstances against you, the more will that inner power manifest itself.*



కఠోర సత్యమేమంటే నీలో యదార్థమైన శక్తి ఉన్నట్లయితే పరిస్థితులు నీకు ఎంత ప్రతికూలంగా ఉంటే, నీలో ఉన్న అంతర్గత శక్తి అంత ఎక్కువగా వ్యక్తమౌతుంది.

*It is my firm conviction that no great work is accomplished in this world by low cunning; so without paying any heed to these vile slanders, I used to work steadily at my mission. The upshot I used to find was that often my slanderers, feeling repentant afterwards, would surrender to me and offer apologies, by themselves contradicting the slanders in the papers.*

ఈ లోకంలో ఏ మహత్కార్యమైనా వంచనవల్ల సాధ్యంకాదని నా దృఢవిశ్వాసము. అందువల్ల ఈ అపనిందల్ని లక్ష్యపెట్టకుండా, నా ఉద్యమాన్ని నిర్భయంగా సాగించే వాణ్ణి. దీని ఫలితంగా, సాధారణంగా నాపై నిందారోపణచేసిన వాళ్ళు తర్వాత పశ్చాత్తాపపడి, నాకు దాసోహమని క్షమాపణ చెప్పకొనేవారు. వారే వార్తా పత్రికలలో తాము చేసిన నిందారోపణలను ఖండించే వారు.



*People will call us both good and bad. But we shall have to work like lions keeping the ideal before us.*



ప్రజలు మనల్ని మంచివారంటారు, చెడ్డవారంటారు. కాని ఆదర్శాన్ని ముందుంచుకొని సింహాలలాగా మనం పనిచెయ్యాలి.

*The greater a man has become, the fiercer the ordeal he has had to pass through.*

మానవుడు ఎంత గొప్పవాడైతే, అంత కఠినమైన పరీక్షలను దాటవలసి ఉంటుంది.



This world is the great gymnasium where we come to make ourselves strong.

ఈ ప్రపంచం ఒక గొప్ప వ్యాయామశాల.
ఇక్కడికి మనం రావడం మనల్ని మనం
బలవంతులుగా చేసుకోవడానికే.



*One must work as the dictate comes from within, and then if it is right and good, the society is bound to veer round, perhaps centuries after one is dead and gone.*

అంతర్వాణి ప్రబోధమును అనుసరించి వ్యక్తి పని చేయాలి. అది యోగ్యమైనది, న్యాయమైనది అయితే సమాజము తన ఆమోదాన్ని తెలుపవలసిందే. కాకపోతే అది ఆ వ్యక్తి మరణించిన కొన్ని శతాబ్దాల తర్వాత కావచ్చు.



*Good motives, sincerity, and infinite love can conquer the world. One single soul possessed of these virtues can destroy the dark designs of millions of hypocrites and brutes.*



సత్సంకల్పం, నిష్కాపట్యం మరియు అఖండప్రేమ అనేవి ప్రపంచాన్ని జయించగలవు. ఈ సుగుణాలు ఉన్న ఒక్క వ్యక్తి లక్షలకొద్ది కపటుల, పశుసమానుల కుతంత్రాలను నశింపచేయగలడు.

*The fact is, my boy, this whole world is full of mean ways of worldliness. But men of real moral courage and discrimination are never deceived by these. Let the world say what it chooses, I shall tread the path of duty - know this to be the line of action for a hero. Otherwise, if one has to attend day and night to what this man says or that man writes, no great work is achieved in this world.*

నాయనా! ఉన్నవిషయమేమంటే, ఈ లోకమంతా నీచమైన ప్రాపంచికతతో నిండిపోయింది. కాని నైతికబలం, వివేకం కలవాళ్లు వీటివల్ల ఎప్పుడూ మోసపోరు. 'లోకం తన ఇష్టంవచ్చినట్లు మాట్లాడనీ. నేను ధర్మమార్గాన్నే అనుసరిస్తాను'... ఇది ధీరుని విధానం అని తెలుసుకో. లేకపోతే రాత్రింబవళ్లు ఈ వ్యక్తి ఏమన్నాడు, ఆ వ్యక్తి ఏమి వ్రాసాడు అని ఆలోచిస్తే ఈ లోకంలో ఏ మహత్కార్యమూ సాధ్యం కాదు.



*We are the sons of Light and children of God. Glory unto the Lord, we will succeed. Do not care for the heartless intellectual writers, and their cold-blooded newspaper articles. Faith.... fiery faith...! Glory unto the Lord - march on, the Lord is our General. Do not look back.... forward-onward ! Thus and thus we shall go on brethren.*



మనము పరంజ్యోతి పుత్రులం. భగవంతుని బిడ్డలం. భగవంతునకు జయమగు గాక! మనం జయించి తీరుతాం. హృదయం లేని, మేధావంతులను, ఏ ప్రతిస్పందన కలిగించని వారి పత్రికా వ్యాసాలనుగాని లెక్కచేయకండి. విశ్వాసము...ఉజ్జ్వల విశ్వాసము... భగవంతుడికి జయమగు గాక! ముందుకు సాగండి, ఆ దేవదేవుడే మన సేనా నాయకుడు. వెనుదిరుగకండి... ముందుకు, ముందుకు నడవండి!

సోదరులారా! ఈ విధముగా మనం ముందుకు నడక సాగించాలి.

*Go on bravely. Do not expect success in a day or a year. Always hold on to the highest. Be steady.  Avoid jealousy and selfishness.*

ధైర్యశాలివై ముందుకు నడు. ఒక్క రోజులోనో, ఒక్క సంవత్సరంలోనో విజయాన్ని  ఆశించకు. ఎల్లప్పుడు ఉత్తమోత్తమమైన ఆదర్శమును కలిగి ఉండు. స్థిరత్వం కలిగి ఉండు. అసూయ, స్వార్థాలను విడిచిపెట్టు.



*Each work has to pass through these stages - ridicule, opposition, and then acceptance.*



ప్రతి పని ఈ మూడు దశలను దాటాలి - అవహేళన, వ్యతిరేకత, తరువాత ఆమోదం.

*But, mind you, this is the life's experience; if you really want the good of others, the whole universe may stand against you and cannot hurt you. It must crumble before your power of the Lord Himself in you if you are sincere and really unselfish.*

జ్ఞప్తిలో ఉంచుకోండి, ఇది జీవితానుభవము. నీవు నిజంగా ఇతరుల శ్రేయాన్ని కోరితే, ప్రపంచ మంతా వ్యతిరేకమై ప్రయత్నించినా, అది నీకు ఏ అపకారం చేయలేదు. నీవు నిజంగా నిస్వార్థ పరుడవై నిష్కపటివై ఉంటే నీలో దీప్తిస్తున్న ఈశ్వరుని స్వకీయశక్తిచే అది తునాతునకలై పోతుంది.



*Each man who thinks ahead of his time is sure to be misunderstood. So opposition and persecution are welcome, only you have to be steady and pure and must have immense faith in God....*



తన కాలం కన్నా ముందుగా ఆలోచించే వారి ఆశయాలను ప్రజలు తప్పక అపార్థం చేసుకుంటారు. కాబట్టి ప్రతిఘటన, వేధింపులు అనివార్యాలు. నీవు ధైర్యంగా, పవిత్రంగా, అచంచలమైన భగవద్విశ్వాసము కలిగినవానిగాను ఉండాలి.

I want each one of my children to be a hundred times greater than I could ever be. Everyone of you must be a giant - must, that is my word. Obedience, readiness, and love for the cause - if you have these three, nothing can hold you back.

మీలో ప్రతివారు, నాకంటే నూరురెట్లు గొప్పవారు కావాలి. మీలో ప్రతిఒక్కరూ ఒక వీరాధి వీరుడు కావాలి. విధేయత, సంసిద్ధత, పనిమీద శ్రద్ధాభక్తులు - ఈ మూడూ మీలో ఉంటే, మిమ్మల్ని ఏ శక్తీ అడ్డుకోలేదు.



This I have seen in life - he who is overcautious about himself falls into dangers at every step; he who is afraid of losing honour and respect gets only disgrace; he who is always afraid of loss always loses.

నాకు జీవితంలో అనుభవమైన విషయమిది - ఎవరైతే తన గురించి అతి జాగ్రత్త వహిస్తారో వారు అడుగడుగునా అపాయాలకు లోనవుతారు. గౌరవం, అభిమానం పోతాయని భయపడుతూ ఉండేవారికి అవమానమే ప్రాప్తిస్తుంది. సదా ఏదో పోతుందని భయపడేవారు ఎప్పుడూ నష్టపోతారు.



None will be able to resist truth and love and sincerity. Are you sincere? Unselfish even unto death, and loving? Then fear not, not even death.



సత్యాన్ని, ప్రేమనూ, నిష్కాపట్యాన్ని ఎవ్వరూ అడ్డుకోలేరు. మీలో నిష్కాపట్యం ఉందా? మృత్యువును స్వీకరించవలసి వచ్చినా నిస్వార్థంగా ఉండగలరా? మీలో ప్రేమ ఉందా? అయితే మీరు భయపడకండి, మృత్యువుకు కూడా భయపడకండి.

*Never lose heart. In eating, dressing or lying, in singing or playing, in enjoyment or disease, always manifest the highest moral courage. Then only will you attain the grace of Mahashakti, the Divine Mother.*

ఎన్నడూ అధైర్యపడవద్దు! ఆహార వ్యవహారాలలో గాని, దుస్తుల విషయంలో గాని, నిద్రించడంలో గాని, ఆటపాటలలో గాని, రోగ భోగాలలో గాని... ఎల్లప్పుడూ ఉత్తమమైన నైతికబలాన్ని ప్రదర్శించండి. అప్పుడే మహాశక్తి (దివ్యజనని) అనుగ్రహం లభిస్తుంది.



*Not one step back, that is the idea... Fight it out, whatever comes, let the stars move from the sphere! Let the whole world stand against us!.... What of it? Thus fight ! you gain nothing by becoming cowards... Taking a step backward, you do not avoid any misfortune.*



ఒక్క అడుగు వెనక్కు వేయవద్దు, అదీ భావన (చెప్పదలచుకున్నది)... ఎలాంటి పరిస్థితి ఎదురైనా పోరాడండి. నక్షత్రాలు స్థానభ్రంశం చెందుగాక! ప్రపంచం మొత్తం మనకు ఎదురు నిలుచును గాక!... అయితే నేం? పోరాడండి! పిరికివాళ్లై మీరు సాధించేదేమీ ఉండదు. అడుగు వెనక్కివేసి మీరు ఏ విపత్కర పరిస్థితి నుంచీ తప్పించుకోలేరు.

*My faith is in the younger generation, the modern generation, out of them will come my workers. They will work out the whole problem like lions.*

ఇప్పటి తరం వారిపై, ఆధునిక యువత పైనే నాకు విశ్వాసం. వారి నుండే నా కార్యనిర్వాహకులు రాగలరు. సింహాల వలె వారు సమస్య నంతటిని పరిష్కరిస్తారు.



*We want some disciples - fiery young men - do you see? - intelligent and brave, who dare to go to the jaws of death, and are ready to swim the ocean across. Do you follow me? We want hundreds like that, both men and women.*



యువకులై, ఉత్సాహవంతులై బుద్ధిమంతులై, ధీరులై మృత్యువును సైతం పరిహసించగలిగి, సముద్రాన్నైనా ఎదురీదడానికి సంసిద్ధులైన కొద్దిమంది శిష్యులు మనకు కావాలి. తెలిసిందా? అటువంటి స్త్రీ పురుషులు మనకు వందల కొద్దీ అవసరం.

*To cowards what advice shall I offer?*
*-nothing whatsoever have I to say...*
*To me, cringing, fawning, whining,*
*degrading inertia and hell are one*
*and the same.*

పిరికిపందలకు నేనేం సలహా ఇవ్వాలి?
వాళ్ళకు నేను చెప్పేది ఏమీ లేదు.... నా ఉద్దేశంలో
భయంతో ముడుచుకుపోయి, బానిస మనసుతో,
గొణుగుతూ, ప్రతీదీ కష్టంగా భావిస్తూ, పతనమొనర్చే
అలసత్వం... నరకం... ఈ రెండూ ఒక్కటే!



*Hold on, boys, no cowards among my children... Are great things ever done smoothly?... I want iron wills and hearts that do not know how to quake... The Lord bless you.*



నిలవండి ఓ బాల కిశోరాల్లారా! నా బిడ్డల్లో పిరికివాళ్ళుండడానికి వీల్లేదు... గొప్ప కార్యాలెప్పుడైనా తేలికగా సాధించబడ్డాయా? నాకు ఉక్కు సంకల్పం కలిగి, ప్రకంపించని (ఏ పరిస్థితిలోనూ) హృదయాలు కావాలి... భగవంతుడు మిమ్మల్ని ఆశీర్వదించు గాక!

*If you are really my children, you will fear nothing, stop at nothing. You will be like, lions.... My prayers and benedictions follow every step you take.... Everything will come to you if you have faith.*

మీరు నిజంగా నా బిడ్డలైతే మీరు దేనికీ భయపడరు. ఎక్కడా ఆగిపోరు. మీరు సింహాల్లాగా ఉంటారు. మీరు వేసే ప్రతి అడుగుకూ నా ప్రార్థనలు, ఆశీర్వాదాలు మీ వెన్నంటి ఉంటాయి... మీకు విశ్వాసం ఉంటే సర్వమూ సమకూరతాయి.



*This life is short, the vanities of the world are transient, but they alone live who live for others, the rest are more dead than alive.*

ఈ జీవితం క్షణికం. ప్రాపంచిక భోగాలు అశాశ్వతాలు. ఇతరుల కొరకు జీవించేవారే యథార్థంగా జీవిస్తున్న వారు. తక్కినవారు జీవన్మృతులు.



*In the world take always the position of the giver; help, give service, give any little thing you can, but keep out barter.*

లోకంలో సదా దాతవై వర్తిల్లు. సహాయం-సేవ చేయి,
నీవు ఇవ్వగలిగిన ఏ అల్పవస్తువునైనా ఇవ్వు.
వస్తు మార్పిడి పద్ధతికి (ఇచ్చి పుచ్చుకోవడానికి) దూరంగా ఉండు.



*My boy, when death is inevitable, is it not better to die like heroes than as stocks and stones? And what is the use of living a day or two more in this transitory world? It is better to wear out than to rust out - specially for the sake of doing the least good to others.*

నాయనా! మృత్యువు అనివార్యమైనపుడు, రాళ్ళు రప్పల్లాగా ఉండటంకంటే ధీరుల్లాగా మరణించటం శ్రేయస్కరం కాదా? ఈ అశాశ్వతమైన ప్రపంచంలో ఇంకా ఒకటి రెండు రోజులు ఎక్కువ బ్రతికి ప్రయోజన మేముంది? తుప్పు పట్టే కంటే, ఈషణ్మాత్రమైనా పరులకు మేలు చేయటంలో అరిగిపోవటం మంచిది.



*Then only will India awake, when hundreds of large hearted men and women, giving up all desires of enjoying the luxuries of life, will long and exert themselves to their utmost for the well being of the millions of their countrymen who are gradually sinking lower and lower in the vortex of destitution and ignorance.*



కోరిక లన్నింటిని విడనాడి, సుఖ భోగాలను త్యజించిన విశాల హృదయులైన స్త్రీ పురుషులు వందల కొద్దీ ముందుకు వచ్చి పేదరికం, అజ్ఞానం అనే సుడిగుండంలో పడి నానాటికీ కృంగి, కృశించి, అణగారిపోతున్న లక్షలాది స్వదేశీయుల సంక్షేమ నిమిత్తం, అపరిమితమైన ఆకాంక్షతో, తమ సర్వశక్తిని ధారపోసి, కష్టించి పని చేస్తేనే భారత జాతి జాగృతం కాగలదు.

*My hope of the future lies in the youths of character--intelligent, renouncing all for the service of others, and obedient--who can sacrifice their lives in working out my ideas and thereby do good to themselves and the country at large. Otherwise, boys of the common run are coming in groups and will come. Dullness is written on their faces--their hearts devoid of energy, their bodies feeble and unfit for work, and minds devoid of courage. What work will be done by these?*

భవిష్యత్తుపై నాకున్న ఆశ అంతా శీలవంతులైన యువకుల మీదనే ఉంది. వారు బుద్ధికుశలురు, తమ సర్వస్వాన్ని ఇతరుల సేవకై త్యాగం చేసేవాళ్లు అయి ఉండాలి. నా ఉద్దేశాలను కార్యరూపంలోనికి తేవటానికి తమ జీవితాలను త్యాగం చేసి, దానివల్ల తమకూ, దేశానికీ సౌభాగ్యం కూర్చే యువకులు కావాలి. సాధారణమైన యువకులు గుంపులుగా వస్తున్నారు, ఇకముందు కూడా వస్తారు. మందకొడితనం వాళ్ల ముఖాలపై వ్రాసి ఉంది. వారి గుండెల్లో ఉత్సాహం లేదు. దుర్బలమైన వాళ్ల శరీరాలు పనికి నిరుపయోగాలు, వారి మనస్సులో ధైర్యం శూన్యం. ఇటువంటి వారి వల్ల ఏం పని జరుగుతుంది?



I want some strongly built, energetic serviceable boys of character.



దృఢగాత్రులు, శక్తిమంతులు, సౌశీల్యం కలిగి సేవానిరతి గల కుర్రవాళ్ళు కొద్దిమంది నాకు కావాలి.

*If in this hell of a world one can bring a little joy and peace even for a day into the heart of a single person, that much alone is true; this I have learnt after suffering all my life; all else is mere moonshine.*

ఈ ప్రపంచమనే నరకంలో ఏ ఒక్క హృదయంలో ఏ కాస్తయినా శాంతి సౌఖ్యాలు కలిగించగలిగితే అదే 'సత్కర్మ' అనిపించుకుంటుంది. జీవితమంతా యాతనలు పడ్డాకా నేనీ రహస్యాన్ని తెలుసుకున్నాను; తక్కినదంతా కేవలం బూటకం.





# విజయానికి మార్గం

# WAY TO SUCCESS



ధీర యువతకు...

*Our mistakes have a place here. Go on! do not look back if you think you have done something that is not right. Now, do you believe you could be what you are today, had you not made those mistakes before? Bless your mistakes, then. They have been angels unawares....Hold on to the ideal. March on? Do not look back upon little mistakes and things. In this battlefield of ours, the dust of mistakes must be raised. Those who are so thin-skinned that they cannot bear the dust, let them get out of the ranks.*

మన తప్పలకు కూడా ఇక్కడ చోటు ఉంది. ముందుకు సాగిపోండి! ఒకవేళ ఏదైనా తప్ప చేశామని మీరు భావించినా వెనక్కు చూడకండి. మీరు ఆ తప్పలు చేయని పక్షంలో ఇప్పడు ఈ విధంగా ఉండేవారా? కాబట్టి మీ తప్పలను దీవించండి, అవి అదృశ్య దేవతలు. లక్ష్యాన్ని అంటిపెట్టుకొని ముందుకు సాగిపో! వెనుకకు తిరిగి అల్ప విషయాలను, చిన్న తప్పలను చూసి క్రుంగిపోవద్దు. ఈ జీవన పోరాటంలో తప్పలనే దుమ్ము రేగవలసిందే! ఈ ధూళికి తాళలేని సుకుమారులను పోరాటాల నుండి వైదొలగనివ్వండి.



*I have committed many mistakes in my life; but mark you, I am sure of this that without everyone of those mistakes I should not be what I am today, and so am quite satisfied to have made them. I do not mean that you are to wilfully commit mistakes; do not misunderstand me in that way. But do not mope because of the mistakes you have committed....*



నేను జీవితంలో అనేక తప్పలను చేశాను. కాని ఆ తప్పలలో ఏది లేకున్నా, నేను ఈ స్థితికి వచ్చివుండకపోయేవాణ్ణి అనడం నిస్సంశయం. కాబట్టి వాటికి నేను కృతజ్ఞుణ్ణి. అలాగని మిమ్మల్ని బుద్ధిపూర్వకంగా తప్పలను చేయమని చెప్పడంలేదు. కాని తప్పలను చేస్తే విలపించకు.

*What is done is done... Do not repent, do not brood over past deeds.... You cannot undo, the effect must come, face it, but be careful never to do the same thing again.*

జరుగవలసింది ఏదో జరిగిపోయిది, చింతించకు. జరిగిపోయిన కార్యాలను గూర్చి పదే పదే తలపోయకు. వాటిని నీవు రద్దు చేయలేవు, కర్మఫలం కలిగే తీరుతుంది. దానిని ఎదుర్కో ! కాని చేసిన తప్పనే మరల చేయకుండా జాగ్రత్త వహించు.



In all our actions, errors and mistakes are our only teachers. Who commits mistakes, the path of truth is attainable by him only. Trees never make mistakes, nor do stones fall into error; animals are hardly seen to transgress the fixed laws of nature; but man is prone to err. And it is man who becomes god-on-earth.



మనం చేసే పనులలోని తప్పలూ, పొరపాట్లే మనకు నిజంగా బోధను గరుపుతాయి. తప్పలు చేసేవారే సత్యపథంలో విజయాన్ని సాధిస్తారు. చెట్లు తప్పలు చేయవు. రాళ్ళు పొరపాట్లలో కూరుకోవు. జంతువులు ప్రకృతి నియమాలను అధిగమించడం సాధారణంగా చూడం. కానీ మనిషి తప్పలను చేసే అవకాశం ఉంది. మళ్ళీ మనిషే భువిపై దైవంగా మారతాడు.

**Onward ! Upon ages of struggle character is built. Be not discouraged.**

పురోగమించు! యుగయుగాల సంఘర్షణ ఫలితంగానే సౌశీల్యం నిర్మితమవుతోంది. అధైర్య పడవద్దు.



Never talk about the faults of others, no matter how bad they may be. Nothing is ever gained by that. You never help one by talking about his faults; you do him an injury, and injure yourself as well.



ఇతరుల దోషాల గురించి, వారెంత దుష్టులయినా సరే ఎన్నడూ ముచ్చటించకు. తద్వారా ఏ మేలు కలుగదు. ఒకరి తప్పలను ఎంచి అతనికి నీవు చేయగల సహాయం ఏదీ లేదు. అటువంటి పనుల వల్ల నీవు అతనికి హాని చేసి, నీకు నీవే హాని చేసుకొంటావు.

*Never mind failures; they are quite natural. They are the beauty of life, these failures. What would life be without them? It would not be worth having if it were not for struggles. Where would be the poetry of life? Never mind the struggles, the mistakes. I never heard a cow tell a lie, but it is only a cow-never a man. So never mind these failures, these little backslidings ! Hold the ideal a thousand times, and if you fail a thousand times, make the attempt once more.*

అపజయాలను లక్ష్య పెట్టకు. అవి వాటిల్లడం సహజం. ఈ అపజయాలు జీవితానికి అలంకారప్రాయాలు. ఇవి లేని జీవితమూ ఒక జీవితమేనా? పోరాటానికి సంసిద్ధం చేసేవి ఈ అపజయాలే కదా! ఇవే జీవిత సౌరభాలు! కాబట్టి ఈ పొరపాట్లను, ఈ పోరాటాలను లక్షించవద్దు. ఆవు అసత్యమాడదు నిజమే. కాని అది ఎప్పటికీ ఆవే! మనిషి కాలేదు. కాబట్టి అపజయాలచే నిరుత్సాహపడకండి. లక్ష్యసిద్ధికై వేయిసార్లు పోరాడండి. వెయ్యిసార్లు ఓటమి వాటిల్లినా, ఇంకొకసారి మళ్ళీ ప్రయత్నించండి.



Character has to be established through a thousand stumbles.



వేల అవరోధాలను అధిగమించినప్పడే సౌశీల్య నిర్మాణం సాధ్యమౌతుంది.

One stumbles more than another,
and him who stumbles more we call bad,
him who stumbles less we call good...
The difference is not one of kind, but of degree.

పయనంలో (జీవన పయనంలో) ఒకని తొట్రుపాటు ఎక్కువగాను, ఒకనిది తక్కువ గాను ఉంటుంది. తక్కువ అయితే సజ్జనుడనీ, ఎక్కువ అయితే దుర్జనుడనీ అంటారు. కాని ఆ రెండూ ఒక్కటే! కనిపించడంలో గల ఎక్కువ తక్కువలకే ఆ పేర్లు.



*Be the servant while leading.*
*Be unselfish. Have infinite patience,*
*and success is yours.*

నాయకత్వాన్ని వహించేటప్పుడు సేవకుడిగా ఉండండి.
నిస్వార్థంగా ఉండండి. అనంత సహనం కలిగి ఉండండి.
అప్పుడు విజయం మీదే.



*The history of the world is that of six men of faith, six men of deep, pure character. We need to have three things: the heart to feel, the brain to conceive, the hand to work.*



విశ్వాసం, సౌశీల్యం గల ఆరుగురు (కొద్దిమంది) వ్యక్తుల చరిత్రే ప్రపంచ చరిత్ర. మనకు కావలసినవి మూడు - ప్రేమించే హృదయం, భావించే మనస్సు, పని చేసే చెయ్యి.

*Make yourself a dynamo... If you are pure, if you are strong, you, one man, are equal to the whole world.*

మిమ్మల్ని ఒక శక్తి జనక యంత్రంగా తయారుచేసుకోండి. మీరు పవిత్రులు, శక్తిమంతులు అయితే మీరొక్కరే ప్రపంచం మొత్తానికి సరితూగగలరు.



*The more we grow in love and virtue and holiness, the more we see love and virtue and holiness outside. All condemnation of others really condemns ourselves. Adjust the microcosm (which is in your power to do) and the macrocosm will adjust itself for you.*



ప్రేమ, మంచితనం, పవిత్రత మనలో ఎంత అభివృద్ధి చెందితే... బయట ప్రపంచంలో అంత ప్రేమ, మంచితనం, పవిత్రత మనకు కనబడతాయి. పరదూషణ నిజానికి ఆత్మదూషణే. మిమ్మల్ని మీరు సరిదిద్దుకొంటే (ఇది మీరు చేయగలిగిన పనియే) ప్రపంచం తనంతట తానే మీకై సరికాగలదు.

*Great enterprise, boundless courage, tremendous energy, and, above all, perfect obedience - these are the only traits that lead to individual and national regeneration.*

అఖండమైన ఉత్సాహం, అపరిమితమైన ధైర్యం, అప్రతిహతమైన శక్తి... అన్నింటినీ మించి పరిపూర్ణ విధేయత - ఈ లక్షణాలే ఒక వ్యక్తినిగాని, ఒక దేశాన్నిగాని పునరుజ్జీవింప చేయగలవు.



*Have patience and be faithful to each other. Do not fight among yourselves. Be perfectly pure in money dealings... So long as you have faith and honesty and devotion, everything will prosper.*



సహనశీలురై ఒకరికొకరు విశ్వాసపాత్రులై ఉండండి. మీలో మీరు తగవులాడుకోవద్దు. ఆర్థిక లావాదేవీలలో పరిపూర్ణమైన పారదర్శకతను (స్వచ్ఛతను) కలిగి ఉండండి. మీకు విశ్వాసం, నిజాయితీ, శ్రద్ధాభక్తులు ఉన్నంత వరకు సర్వం వికాసాన్ని పొందుతుంది.

From all of you I want this, that you must discard forever self-aggrandisement, faction-mongering, and jealousy. You must be all forbearing, like Mother-Earth. If you can achieve this, the world will be at your feet.

మీరందరు స్వలాభాన్ని, వర్గకీచులాటలను, అసూయను విడిచిపెట్టండి. భూమాతవలె ఓర్మి కలిగి ఉండండి. దీనిని మీరు సాధించగలిగితే లోకమే మీకు పాదాక్రాంతమవుతుంది.



Give up criticism altogether. Help all as long as you find they are doing all right, and in cases where they seem to be going wrong, show them their mistakes gently. It is criticising each other that is at the root of all mischief. That is the chief factor in breaking down organisations.



విమర్శించడం విడిచిపెట్టండి. ఎదుటివారు చేసే పని మంచిదైతే మీకు చేతనైన సహాయం చేయండి. వారు తప్పు ద్రోవ పడుతున్నారనిపిస్తే వారి తప్పలను సున్నితంగా తెలియజేయండి. ఒకరినొకరు తప్పు పట్టుకోవడమే అన్ని అనర్థాలకు మూలం. సంస్థల వినాశనానికి ముఖ్యకారణం కూడా ఇదే.

*What is wanted is a power of organisation - do you understand me? Have any of you got that much brain in your head? If you do, let your mind work.*

సంఘటితంగా పనిచేయడం కావాలి - నీవు నన్ను అర్థంచేసుకుంటావా? మీకెవరికైనా బుర్రలో ఈ పాటి మేధాశక్తి ఉందా? ఉంటే మీ మనస్సును పనిచేయనివ్వండి.



*Be unselfish, and never listen to one friend in private accusing another.*



నిస్వార్థంగా పని చేయండి.
మరొకరిని చాటున దూషిస్తున్న మిత్రుని
మాటలను ఎన్నడూ వినవద్దు.

*I want that there should be no hypocrisy, no roguery... There should not be a breath of immorality, nor a stain of policy which is bad.*

కపటం, దుర్మార్గం ఎంత మాత్రం ఉండకూడదు. అల్పశ్వాస పాటి అనైతికత, నలుసంత చెడు విధానం కూడా తగవు.



*Work unto death - I am with you, and when I am gone, my spirit will work with you. This life comes and goes - wealth, fame, enjoyments are only of a few days. It is better, far better to die on the field of duty, preaching the truth, than to die like a worldly worm. Advance!*

ప్రాణమున్నంత వరకు పనిచేయండి. నేను మీకు అండగా ఉన్నాను. నేను పోయిన తర్వాత కూడా నా అంతరాత్మ మీ వెంటే ఉండి పని చేస్తుంది. ఈ జీవితం వస్తుంది పోతుంది; సంపద, కీర్తి, భోగాలు మూడునాళ్ల ముచ్చటే. ఒక ప్రాపంచిక క్షుద్రకీటకంవలె చనిపోవడం కన్నా సత్యాన్ని బోధిస్తూ కార్యరంగంలో మరణించడం ఉత్తమం. ముందంజ వేయండి!



Work as if on each of you depends the whole work.



మీలో ప్రతి ఒక్కరూ, కార్య భారమంతా మీపైనే ఉందన్న భావంతో పని చేయండి.

No great work can be achieved by humbug. It is through tremendous energy that all undertakings are accomplished. Therefore manifest your manhood.

ఏ ఘనకార్యాన్నీ మోసంతో సాధించలేం. అప్రతిహతమైన శక్తి ద్వారా మాత్రమే సమస్త కార్యాలు సాధించబడతాయి. కాబట్టి ధీరత్వాన్ని ప్రదర్శించండి.



*Multitude counts for nothing. A few heart-whole, sincere, and energetic men can do more in a year than a mob in a century.*



జన సమూహం కాదు కావలసింది. పామరుల గుంపు ఒక శతాబ్దంలో చేసిన పనికంటే నిష్కపటులై హృదయపూర్వకంగా పనిచేసే కొద్దిమంది ఒక్క సంవత్సరములోనే ఎక్కువగా సాధించగలరు.

My hope and faith rest in men like you. Understand my words in their true spirit and apply yourselves to work in their light... I have given you advice enough; now put atleast something in practice. Let the world see that your listening to me has been a success.

నా ఆశ, విశ్వాసము మీ వంటివారి మీదనే ఉన్నాయి. యదార్థ దృష్టితో నా మాటలను సరిగా అర్థం చేసికొని, ఆ ప్రకారంగా మీరు కార్యోన్ముఖులవ్వండి. మీకు కావలసినంత సలహా ఇచ్చాను. కొంచెమైన ఇప్పుడు ఆచరణలో పెట్టండి. నా మాటలు వినడం ఉపయోగ కరమైనదని లోకానికి తెలియనీయండి.



*Take courage and work on. Patience and steady work - this is the only way. Go on; remember - patience and purity and courage and steady work.... So long as you are pure, and true to your principles you will never fail.*



ధైర్యంతో  కర్తవ్యాన్ని నిర్వహించు. ఓర్పు, స్థిరత్వాలతో పనిచేయి... ఇదే ఏకైక మార్గము. ఓర్మి, పవిత్రత, ధైర్యం, స్థిరత్వంతో పనిచేయాలని గుర్తుంచుకొని ముందుకు నడువు. పవిత్రంగా ఉండి నీ ఆదర్శాలకు కట్టుబడి ఉన్నంత కాలం నీకు అపజయం కలుగదు.

*You have to be practical in all spheres of work. The whole country has been ruined by masses of theories.*

నీ ప్రతి పనిలోనూ ఆచరణాత్మకతను కనబరచు. ఆచరణ కొరవడిన అనేక సిద్ధాంతాల వల్లే దేశం పూర్తిగా నాశనమైంది.



*Opposition to a righteous work initiated with moral courage will only awaken the moral power of the initiators the more. That which meets with no obstruction, no opposition, only takes men to the path of moral death.*



నైతిక ధైర్యంతో ప్రారంభించిన మంచిపనికి ప్రతికూలత ఉంటే, అది ప్రారంభించిన వాళ్ల నైతిక బలాన్ని మరింత ఉత్తేజ పరుస్తుంది. ప్రతిఘటన, ఆటంకం దేనికి ఉండదో అది మానవులను మృత్యుసదృశ నైతిక పతన మార్గానికి కొనిపోతుంది.

*We need a heart to feel, a brain to conceive, and a strong arm to do the work... Make yourselves a fit agent to work.... In a conflict between the heart and the brain, follow your heart.*

మనకు కావలసింది స్పందించే హృదయం, ఆలోచించే మెదడు, పని చేసే బలిష్ఠమైన హస్తం. కర్మ చేసే యోగ్యతను సంపాదించు. హృదయానికి మనసుకి సంఘర్షణ జరిగినప్పుడు, హృదయాన్ని అనుసరించు.



*If you have not even a little imagination, if you have no ideal to guide you, you are simply a brute. So you must not lower your ideal, neither are you to lose sight of practicality. We must avoid the two extremes... You must try to combine in your life immense idealism with immense practicality.*



మీకు కొద్దిపాటి కల్పనాశక్తి లేకపోతే, మార్గదర్శకమైన ఆదర్శం లేకపోతే, మీరు కేవలం పశుతుల్యులే. కాబట్టి మీ ఆదర్శాన్ని తగ్గించుకోకూడదు. అలా అని అసాధ్యమైన దాన్ని ప్రయత్నించరాదు. ఈ రెండూ విసర్జనీయాలే! ఉన్నత ఆదర్శంతో ఉత్తమ ఆచరణాన్ని మీ జీవితంలో సమన్వయపరచడానికి ప్రయత్నించండి.

On you lie the future hopes of our country. I feel extreme pain to see you leading a life of inaction. Set yourselves to work - to work! Do not tarry.... Do not sit idle, thinking that everything will be done in time, later on! Mind you - nothing will be done that way !

మన దేశపు ఆశలన్నీ మీపైనే ఉన్నవి. సోమరులుగా మీరు కాలం గడపటం నాకు బాధను కలిగిస్తోంది. కార్యదీక్షాపరులు కండి. ఆలస్యం చేయవదు. అంతా సరియైన సమయంలో జరుగుతుందని సోమరులుగా కూర్చోవద్దు. ఆ విధంగా ఏ పనీ నెరవేరదని గుర్తుంచుకోండి.



*Idleness won't do. Throw overboard all idea of jealousy and egotism, once for all. Come on to the practical field with tremendous energy; to work, in the fullness of strength!*



వ్యర్థకాలయాపన పనికి రాదు. అసూయ, అహంకారం అనే భావాలను పూర్తిగా విడిచిపెట్టండి. అప్రతిహతమైన శక్తితో కార్యరంగలోకి దూకి  సాహసవంతులుగా పని చేయండి.

You have not caught my fire yet - you do not understand me! You run in the old ruts of sloth and enjoyments. Down with all sloth, down with all enjoyments here or hereafter....

నా ఉద్వేగం మీకింకా ఒంటపట్టలేదు. నన్ను మీరు అర్థం చేసికోలేదు. సోమరితనం, సుఖానుభవం అనే పాతపంథాలలోనే మీరింకా పరుగెత్తుతున్నారు. ఈ అలసత్వం ఇక చాలు. ఇహపర ఫలభోగాసక్తి ఇక చాలు.





*That you may catch my fire,*
*that you may be intensely sincere*
*is my constant prayer.*



మీరు నా ఉద్వేగాగ్నిని అందుకోవాలని,
అత్యంత నిష్కపట వర్తనులవ్వాలని
నా నిరంతర ప్రార్థన.